Phone : 41365 Grams : OFFSET



# PRASAD PROCESS

## PRIVATE LIMITED,

CHANDAMAMA BUILDINGS, MADRAS-26

......Started in 1953 we have installed the latest types of Graphic Arts Machinery, employed the best Artists and Artisans who have been specially trained to execute the finest works for

**YOU**
**and**
**THE TRADE......**

CALENDAR OR A CARTON..
POSTER OR A PACKAGE SLIP..
LABEL OR LETTER DESIGN..

***..... DONE SUPERBLY***
***IN MULTICOLOR***

---

*Bombay Office:*
101, Pushpa Kunj, 16-A, Road, Church Gate, Bombay-1

*Bangalore Representative:*
181, 6th Cross Road, Gandhinagar, Bangalore-9.
Phone: 6555

అతి త్వరలో!

STUDIO Ketha

శ్రీ వేంకటరామా
ఫిలింస్ వారి

# విష్ణుమాయ

దర్శకత్వం: నండూరి నమ్మాళ్వార్





రచన: గబ్బిట వేంకటరావు  కళ: వాలి
సంగీతం: మల్లేశ్వరరావు  ఛాయ: జాగీర్దార్
ఎడిటర్: M. బాబు B.A.,

NEGATIVE RIGHTS CONTROLLED BY:
P.A. GOPALA KRISHNA RAO, B.Sc., ROYAPETTAH, MADRAS-14.

CHITRALEKHA




ఎక్కడ

**లైఫ్‌బాయ్** ఉన్నదో

అక్కడ ఆరోగ్యము ఉన్నది

లైఫ్‌బాయ్ సబ్బు మురికిలోగల క్రిములను కడిగివేస్తుంది.
లైఫ్‌బాయ్ వల్ల కుటుంబములో అందరి జీవితం...ఆరోగ్య వంతం !

హిందుస్థాన లీవర్ ఉత్పత్తి

L. 38-77 TL

నేడే
చూడండి

R.V.H.H. ప్రసాద్స్ సన్స్
ఆ కంపెనీ సమర్పించు
శ్రీ హరిహర మూవీస్ వారి

ఉత్తమ
సాంఘిక చిత్రం.

# తల్లీ బిడ్డలు

సంగీతం...... బి. శంకర్రావు. నృత్యం...వెంపటి చినసత్యం
ఛాయాగ్రహణం...K.S. ప్రసాద్.

దర్శకుడు...P.S. శ్రీనివాసరావు. B.A

# పిల్లలకు **తుషార్** తో తయారైన వంటకాలు బాగా రుచింమను




తుషార్ వనస్పతిలో పిల్లలకు యిష్టమయ్యే ప్రత్యేకమైన రుచి వుంది. తుషార్ తో వండిన ఆహారం రుచికరమే గాక పుష్టికరం గూడా. ఎందుకంటే తుషార్ లో ఎ,డి, విటమినులు వున్నాయి. రుచికరమైన భోజనానికి తుషార్ తో వంట చేయండి.

## తుషార్

వనస్పతిలో ఎ. డి
విటమినులు కలవు.

తుంగభద్రా ఇండస్ట్రీస్ లి., కర్నూలు.

ASP/TI-10

# పొదుపుకోసం అమృతాంజన్ అట్టపెట్టెల్లో వస్తోంది




నేడు మన దేశపు ఆదాయము రక్షణ కొరకు అవసరము. సాధారణంగా పరిచితమైన అమృతాంజన్ డబ్బా తయారుచేయడానికి కావలసిన టిన్ రేకు నేడు జాతీయ అత్యవసరాలకు కేటాయింపబడినది. కాబట్టి దీనికి బదులు మేము క్రొత్త రకం పొదుపైన అట్టపెట్టె వాడుతున్నాము. ఇంతేగాకుండా సీసాలో నమ్మకమైన అమృతాంజన్ అందజేయడానికి మోసంచేయడానికి వీలులేకుండా 'అలు'కాప్ ('Alu'-cap) తో సీసా సీలు చేయబడింది. పూర్వం ఎప్పటికంటే కూడా ఇప్పుడు మీకు అమృతాంజన్ ఎక్కువ అవసరము. కండల నొప్పులు, బెణుకులు, గుండె బలుబులు, కీళ్ళ నొప్పులు, ఆరోగ్యం చెరచి నీరసపరచి అధికంగా కావలసిన ఉత్పత్తులను తగ్గించే రోగాలు నిర్మూలించడానికి సహకరిస్తుంది.

*అమోఘమైనది, మిత వ్యయంతో కూడినది, అనేక విధాల ఉపయోగపడేది.*

అమృతాంజన్ అమోఘంగా పనిచేసే నొప్పుల నివారణిని మీరు కొనవచ్చు. ఇటువంటి మందులన్నిటికంటె దీనిలో గుణావహకమైన ఔషధాలు అధిక పరిమాణాల్లో ఉంటాయి. దీనిలో ఏకమైయున్న మందులు బాధలను నివర్తించి వెంటనే ఉపశమనం కలిగించడానికి శరీర చర్మంలో అతి శీఘ్రంగాను లోతుగాను ప్రవేశిస్తాయి. ప్రతీసారీ మీకు ఏ నాలుగు వర్ల గింజల ఎత్తో అమృతాంజన్ కావలసి ఉంటుంది. ఇంట్లో ఇంటిల్లిపాదీ ఉపయోగించినా ఒక బుడ్డి నెలల తరబడి ఉపయోగానికి వస్తుంది.




# అమృతాంజనము

ఆరోగ్యం ఇస్తుంది

అమృతాంజన్ లిమిటెడ్ 14/15 లజ్ చర్చి రోడ్. మద్రాసు

JWT AM/2225'a

త్వరలో విడుదల!

శ్రీకృష్ణసాయి ఫిలింస్ వారి




# పెంచినప్రేమ

నిర్మాత
**యర్రా అప్పారావు**

దర్శకత్వం
**కృష్ణన్ పంజు**

స్టూడియో...ఏ.వి.ఎమ్ * శ్రీఫిలింస్

# రొంపను దరిచేరనీయకండి

సేవించండి

## వాటర్‌బరీస్ కాంపౌండు | ఎర్ర లేబిలు

## కేవలం నివారిణియే కాదు నమ్మకమైన టానిక్కు కూడా!




వాటర్‌బరీస్ కాంపౌండు మీద, తరతరాలుగా, కుటుంబాలు నమ్మకముంచి ఆధారపడడానికిగల అనేక మంచి కారణాలలో నాలుగింటిని ఈ క్రింద ఉదహరిస్తున్నాము.

1. వాటర్‌బరీస్ కాంపౌండులో క్రియోసోట్ మరియు గయాకోల్ గలవు. అవి వాయు తిత్తులను శుభ్రపరుస్తాయి.
2. వాటర్‌బరీస్ కాంపౌండు దగ్గులను సత్వరం ఫలప్రదంగా నిర్మూలిస్తుంది.
3. వాటర్‌బరీస్ కాంపౌండు నివారిణియేగాక నమ్మకమైన టానిక్కు కూడా. శరీర ప్రతిఘటన శక్తిని పెంపొందించడంలో సాయపడుతుంది.
4. వాటర్‌బరీస్ కాంపౌండు ఆకలిపుట్టిస్తుంది. జీర్ణముగుటలో సాయపడుతుంది. రక్తమును శుభ్రపరుస్తుంది. మరియు ఖనిజ లవణముల నష్టమును భర్తీ చేస్తుంది.



## వాటర్‌బరీస్ కాంపౌండు | ఎర్ర లేబిలు

వార్నర్-లేంబర్ట్ ఫార్మసూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతలలో యు ఎస్. ఎలో స్థాపితము)

WCRY-3-TEL



పెప్స్
గొంతు
మరియు



గుండె
బిళ్లలను
మీరు
సేవించేయడల
మీ దగ్గు త్వరితంగాపోవును

ఒక పెప్సును చప్పరించి, అందలి శమనకర చర్యను జరిపే ఆవిరులను ఆస్వాదించండి। ఆవి నొప్పినిపోగొట్టి, గొంతునొప్పిని, రొమ్ము పడిశెమును, దగ్గు లేక జలుబును కలిగించే క్రిములను చంపును. పెప్స తక్షణశమనమును, శీఘ్ర నివారణను గలిగించును.




పెప్స-వీటిలో హానికర ఓషధులు లేవు.
పిల్లలకు సురక్షితంగా ఇవ్వవచ్చును.
రొమ్ము పడిశెములు, గొంతు నొప్పి, పడిశెము, అధిక కఫము జలుబులు, దగ్గులను
త్వరితంగా నివారించును

మందుల వ్యాపారులందరివద్ద అమ్మబడుచున్నవి
సి. ఇ. ఫుల్‌ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లి.

FPY-54 TEL

సోల్ ఏజంట్లు :

దాధా & కంపెనీ,
86, నైనియప్ప నాయక్ వీధి,
మదరాసు - 3

# నెరసిన శిరోజాల గురించి చింతించ నక్కర్లేదు

హెయిర్ ఆయిల్‌గా




మీరు వాడితే చాలు




సోల్ ఏజెంట్లు అండ్ ఎగుమతి దార్లు
ఎమ్.ఎమ్. ఖంభట్ వాలా,
అహమదాబాద్ (భారతదేశం)
ఏజెంట్లు :
సి. నరోత్తమ్ అండ్ కొ.,
బొంబాయి - 2



సినిమా
తారలు
మెచ్చిన




రెమి
పౌడర్

ఓ.కె. వనస్పతి
ఓ.కె. రిఫైన్డ్ ఆయిల్
ఓ.కె. గోల్డెన్ సాలడ్ ఆయిల్
ఓ.కె. శాండల్ సబ్బు
ఓ.కె. నీమ్ సబ్బు – మిఓకె సబ్బు
ఓ.కె. ఓరియంటల్ రోస్ సబ్బు
ఓ.కె. సోప్ చిప్స్ కొన్నప్పుడల్లా




# ఉచితం!

EP-EAC 7

అందమైన స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలను
బహుమతి పొందండి

ది ఈస్ట్ ఏషియాటిక్ కంపెని (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
మద్రాసు-1



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

పాఠకుల నుంచి "చందమామ"కు రచనలు కుప్ప తెప్పలుగా వస్తున్నాయి. అనేకమంది, "మా వద్ద కథలున్నాయి. పంపించమంటే పంపిస్తాము," అని రాస్తున్నారు. మరి కొందరు, కథలు ఎలా రాయాలి, వాటిని ఎలా పంపాలి అని మమ్మల్నే అడుగుతున్నారు. ఇవన్నీ రచన చెయ్యాలని పాఠకులకు గల ఉత్సాహాన్ని సూచిస్తాయి. కాని కథలు రాయటానికి కేవలమూ ఉత్సాహం ఉంటే చాలదు, శక్తి కూడా కావాలి. అయిదో క్లాసో, ఆరో క్లాసో చదివే చిన్న పిల్లలకు కథలు రాయటం ఎలా సాధ్య మవుతుంది? ఈ ఉత్సాహవంతులకు మా సలహా ఏమంటే, ప్రస్తుతానికి కథలు ఆనందించటం నేర్చుకోండి. భాషా, భావ ప్రకటనా అలవరుచుకోండి.

సంపుటి : 32 - మే 1963 - సంచిక : 5



CHITRA---



# భారత చరిత్ర



నాసిరుద్దీన్‌కు పిల్లలు లేనందున అతను మరణిస్తూ ఘియాసుద్దీన్ బల్బన్‌ను తన వారసుడుగా నియమించాడు. ఇందుకు ఢిల్లీ ప్రముఖులు కూడా ఆమోదించారు.

బల్బన్ తుర్కిస్తానులోని ఇల్బరీ తెగకు చెందినవాడు. కుర్రవాడుగా ఉండగానే మంగోలు లితన్ని పట్టుకుని బగ్దాదుకు తెచ్చారు. ఖ్వాజా జమాలుద్దీన్ అనే ఆయన అతన్ని బానిసగా కొని, 1232 లో తన ఇతర బానిసలతో బాటు ఢిల్లీకి తెచ్చి, ఆ బానిసలందరినీ సుల్తాన్ ఇల్తుత్మిష్‌కు అమ్మాడు. బానిసగా ఉండిన బల్బన్ స్వశక్తి చేత క్రమంగా పైకి వచ్చాడు. ఇతని కుమార్తెను 1249 లో సుల్తానే స్వయంగా పెళ్ళాడాడు.

ఇల్తుత్మిష్ చనిపోయిన 30 ఏళ్ళకు బల్బన్ సుల్తానయాడు. ఈ మధ్య కాలంలో రాజ్యాంగం ఎంతో తారుమారయింది. ఖజానా దాదాపు ఖాళీ అయింది. పరిపాలకులపై పాలితులకు లక్ష్యం పోయింది. దీనికి తోడు మంగోలుల దాడులు శరపరంపరగా సాగాయి. ఈ పరిస్థితులను బల్బన్ సమర్థతతో చక్కబరిచాడు. సైన్యాన్ని గట్టి "మాలిక్"ల అధీనం చేశాడు. ప్రాణహానీ, ధనహానీ, వ్యాపారానికి అంతరాయమూ కలిగించే బందిపోటు ముఠాలను నిర్మూలించాడు. గోపాలగిరి, జలాలీ మొదలైన ప్రమాద ప్రాంతాల రక్షణకుగాను దుర్గాలు నిర్మించాడు. రహదార్లను నిర్భయం చేశాడు.

వాయువ్య సరిహద్దు మంగోలుల ప్రమాదంలో పడింది. వారు ఖలీఫాను హత్యచేసి బగ్దాదును వశపరచుకున్నారు, ఘజ్నీలో రాజ్యం స్థాపించుకున్నారు, పంజాబు, సింధు రాష్ట్రాల పైకి వచ్చారు. మంగోలుల నాయకుడు అల్ ముతసిమ్. వారు లోగడ విధ్వంసం చేసిన లాహోరు దుర్గాన్ని బల్బన్ 1271 లో మరమ్మతు చేయించాడు.

**20.** *బానిసవంశ సమాప్తి*



బల్బన్ దాయాది షేర్‌ఖాన్ సుంకర్‌కు పంజాబులో కొన్ని జాగీర్లుండేవి. ఇతను మంగోలులకు సింహస్వప్నంగా ఉండి వారిని నిగ్రహిస్తూ వచ్చాడు. ఇతన్ని బల్బన్ అసూయానుమానాలతో విషంపెట్టి చంపించాడు. ఇది రాజకీయంగా అవివేకమైన పని. షేర్‌ఖాన్ చావటంతోనే మంగోలులు విజృంభించి, సరిహద్దుపై దాడులు సాగించారు. వీరి దోపిడీలను అరికట్టటానికి బల్బన్ తన పెద్ద కొడుకును, యువరాజు ముహమ్మద్‌ను, ముల్తాను గవర్నరుగా నియమించాడు; తన రెండవ కొడుకైన బుగ్రాఖాన్‌కు సామాన, సునామ్ మొదలైన జాగీర్లు వశపరిచాడు. 1279 లో మంగోలులు పెద్ద ఎత్తున దాడిచేసి సట్లెజ్ నదిని దాటి వచ్చినప్పుడు సుల్తాను కొడుకులు తమ సేనలతోనూ, ఢిల్లీ నుంచి వచ్చిన సేనలతోనూ మంగోలులను తిప్పికొట్టారు.

ఈ సంవత్సరంలోనే బెంగాలులోని రాజప్రతినిధి తుగ్రిల్‌ఖాన్ అనేవాడు ఢిల్లీని ధిక్కరించాడు. ఈ రాజ ప్రతినిధి చాలా సమర్థుడు. కాని సుల్తాను వృద్ధుడు కావటం చేతనూ, పడమటి నుంచి ఒక వంక మంగోలుల బాధకు గురి అవుతూండటం చేతనూ, ఢిల్లీ చాలా దూరాన ఉండటం



చేతనూ తుగ్రిల్‌ఖానుకు దురాశ కలిగింది. తిరుగుబాటుకు అతని సలహాదార్ల ప్రోత్సాహం కూడా లభించింది.

బల్బన్ ఈ తిరుగుబాటు చూసి కంగారుపడి, అమీర్‌ఖాన్ అనే వాడి నాయకత్వాన బెంగాలు పైకి పెద్ద సేనను పంపాడు. యుద్ధంలో అమీర్‌ఖాన్ ఓడిపోయాడు. అతని సేనలు చాలా భాగం లంచాలు పుచ్చుకుని శత్రువుతో చేరిపోయాయి. ఓడి వచ్చినందుకు అమీర్‌ఖాన్‌కు సుల్తాను మరణ దండన విధించాడు! 1280 లో పంపిన మరొక సేనకూడా తిరుగుబాటుదారుకు ఓడిపోయింది. తుగ్రిల్‌ను శిక్షించటానికి

బల్బన్ స్వయంగా సేనను నడుపుకుని, తన రెండవ కొడుకును బుగ్రాఖానును వెంట పెట్టుకుని, పశ్చిమ బెంగాలులోని లఖ్నౌతీ చేరాడు. తుగ్రిల్ ఈ వార్త తెలుస్తూనే లఖ్నౌతీ నుంచి జాజ్‌నగర్ అరణ్యాలలోకి పారిపోయాడు. తిరుగుబాటు దార్లను తరుముకుంటూ బల్బన్ తూర్పు బెంగాలులోకి వెళ్ళాడు. చివరకు తుగ్రిల్‌ను బాణంతో పడగొట్టారు. అతని తల నరికి, మొండెం నదిలో పారేశారు.

1285 లో మంగోలులు పంజాబు పైకి వచ్చారు. బల్బన్ పెద్ద కొడుకు వారి నెదుర్కొన్నాడు. ఆ ఏడు మార్చి 9 న మంగోలులు అతన్ని మాటు వేసి చంపారు. 80 ఏళ్ళ వృద్ధుడైన బల్బన్ ఈ సంఘటనతో కుంగిపోయాడు.

బల్బన్ తన మనమడైన కైఖుస్రవ్‌ను తనకు వారసుడుగా నియమించి 1287 అంతంలో చనిపోయాడు.

బల్బన్ అనంతరం ఆయన కిందివారు కైఖుస్రవ్‌ను కాక, బుగ్రాఖాన్ కొడుకును ముయిజుద్దీన్ కైకుబాద్‌ను సింహాసనం ఎక్కించారు. ఇతని వయసు 17 లేక 18. చిన్న తనం నుంచీ క్రమశిక్షణలో పెరిగిన ఈ కుర్రవాడు సింహాసనం ఎక్కుతూనే విశృంఖలంగా భోగాలలో మునిగి తేల సాగాడు. ఢిల్లీ కొత్వాలుకు నిజాముద్దీన్ అనే అల్లుడుండేవాడు. అతను రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకున్నాడు. అధిపత్యం కోసం తుర్కుల పక్షానికీ, ఖల్జీల పక్షానికీ, ఘర్షణ సాగింది. మాలిక్ జలాలుద్దీన్ ఫీరూజ్ అనేవాడి నాయకత్వాన ఖల్జీలది పై చెయ్యి అయింది. కైకుబాద్‌ను హత్య చేసి అతని శవాన్ని యమునా నదిలో పారేశారు. అతని పసి కొడుకును కూడా చంపేసి 1290 జూన్ 13 న జలాలుద్దీన్ ఫీరూజ్ షా, ఖిలోఖ్రీ రాజభవనంలో పట్టాభిషేకం చేసుకున్నాడు.





# దాస్యవిముక్తి

పంచమాశ్వాసము :

తల్లి పాదములకు మ్రొక్కి,
తలవంచుక నిలువంబడి,
గరుత్మంతు డిట్లు పలికె
గంభీర స్వరముతోడ :

"అమ్మా! నీ దుఃఖమెల్ల
అర్థమైన దీ నాటికి;
ఈ దాస్యము తొలగించెద
ఇదె నీ అడుగుల సాక్షిగ.

కద్రువ అమృతము కోరెను,
కావున అది తెచ్చియిచ్చి
దుర్భరమగు ఈ దాస్యము
తొలగించెద — నిశ్చయ మిది."

అని పలికిన, వినతాసతి
కనుల నీరు తుడుచుకొనుచు,
"తండ్రీ! నిను భగవంతుడు
దయతోడుత రక్షించుత!

కన్నకొడుకు సామర్థ్యము
కలవాడై యున్నప్పుడు,
తల్లి కష్టములు తీరుట
ధాత్రిని ఎందైన కలదు.

నిన్నుబోలు సత్పుత్రుని
కన్న తల్లినై యుండియు
దాస్య మనుభవించెదనా?
దడిసెదనా సవతాలికి?"

అనిన గరుత్మంతు డపుడు
"అమ్మా! నను దీవించుము,
అమృతము గొనివచ్చుటకై
ఆనతిచ్చి పంపించుము—"

అని మ్రొక్కిన, వినత కనుల
ఆనందాశ్రులు నిండెను;
కౌగిలించుకొని కొడుకును
కడుపారగ దీవించెను.

ఉత్పల సత్యనారాయణాచార్య

"ఓ కుమార! నీ జనకుని
యొద్దకు ముందుగ వెళ్ళుము;
ఆ మహాత్ము డిచ్చునట్టి
ఆశీస్సులు పొంది పొమ్ము."

అట్లేయని గరుత్మంతు
డాకసమున కెగసినాడు;
అతని ఱెక్కల గాలికి
అల్లలాడె చెట్లెల్లను!

గంధమాదనమున నున్న
కశ్యపముని కడకు పోయి,
'వైనతేయు డిదె తండ్రీ!
వందన మిడుచున్నవాడు.'—

అనినంతట కశ్యపముని
కనులు తెఱచి చూచినాడు;
'ఆయుష్మాన్ భవ'యని ముని
ఆశీస్సులు పలికినాడు.

తల్లి దాస్యమును, కద్రువ
తనతో చెప్పిన మాటలు,
గరుడుడు తండ్రికి తెల్పెను;
మఱియిట్టుల ప్రార్థించెను:

"తండ్రీ! దీవించుము; పెద
తల్లికి నే చెప్పినట్లు
దేవలోకమునకు పోయి
తెచ్చి యిచ్చెదను అమృతము."

అని చెప్పగ కశ్యపముని
విని ఒక నిట్టూర్పు విడిచి,
"ఓ కుమార! దేవేంద్రుడు
నీ కమృతము దొరకనీడు.

దుష్కరమగు పనికి నీవు
దొరకొంటివి! ఏమందును!"
అనిన గరుత్మంతు డపుడు
వినయముతో ఇట్టులనెను:

"తండ్రీ! అనుమానింపకు—
తల్లి దాస్యమును తీర్పగ
అనువులైన ధారవోసి
అమృతమ్మును గొనివచ్చెద.

ఆజ్ఞ యిచ్చి నాకు తగిన
ఆహారము చూపించిన,
బలిమి మెఱసి దేవేంద్రుని
గెలిచి తెచ్చెదను అమృతము."



అనినంతట కశ్యపముని
అమితానందము పొందెను ;
గరుడుని ప్రియమార బిగ్గ
కౌగిలించుకొని ఇట్లనె :

" పుత్రా! నీకు జయంబగు
పా, మ్మటు చూడుము తూర్పున
ఉరగ శైలమను పర్వత
మొకటున్నది ఎత్తైనది.

దాని చెంత నడకొండగ
ఏనుగొకటి తిరుగుచుండు ;
అచ్చటనే ఒక మడుగున
అంతటి తాబేలున్నది.

ఏనుగునకు తాబేటికి
ఎల్లప్పుడు పోరాటము ;
ఆ రెండిటి పోరు మాన్పి
ఆహారము చేసికొనుము."

అని ఆనతియిచ్చి పంప
వినతాసుతు డెగసిపోయి,
గ్రక్కున ఉరగాద్రి జేరి
గజ కచ్ఛపముల చూచెను.

చూచి చూచి వెనుకనుండి
సుడిగాడ్పయి లేచివచ్చి,
తన కాళ్ళకు ఆ రెంటిని
తన్ని పట్టి పై కెగసెను.




ఆకసమున మబ్బులతో
ఆటాడగ కొండయొకటి
లేచినదో అనునట్లుగ
తోచినాడు గరుడు డపుడు !

అతని కొక పెద్ద చెట్టు
అగుపించెను—దాని కొమ్మ
ఐదామడలంత మేర
ఆకట్టిన యట్లున్నది !

దానిమీద కూరుచుండి
తాబేటిని ఏనుంగును
తినదలంచి గరుడుడు ఆ
పెనుకొమ్మను వ్రాలినాడు.

వ్రాలినంత ఫెళఫెళమని
వ్రీలి విఱిగె చెట్టుకొమ్మ ;
గరుడుడు చప్పున ముక్కున
కఱచి పట్టె నా కొమ్మను.

వాలఖిల్యు లా కొమ్మను
వ్రేలాడుచు నుండుట కని
దానిని మెలమెల్లగ గొని
తండ్రి యొద్ద కేతెంచెను.

ముంగాళ్ళకు పీనుంగులు,
ముక్కున ఘనశాఖ చూచి,
కశ్యపముని తన కొమరుని
కష్టమెల్ల గ్రహియించెను.

వెనువెంటనె వాలఖిల్య
మునుల జూచి, "ఋషులారా!
దయతో ఈ కొమ్మ విడిచి
తక్షణమే దయచేయుడు.

నా కుమారు డీ గరుడుడు
మీకు బాధయగునని తన
ముక్కున ఈ పెనుకొమ్మను
మోచినాడు, కరుణింపుడు."

అని కశ్యపముని వేడగ
ఆ మును లా కొమ్మ నుండి
దిగి, గరుడుని పలుసారులు
దీవించుచు వెళ్ళినారు.

"ఓ కుమార! ఇక వెళ్ళుము
ఈ కొమ్మను నిర్జనమగు
నిష్పురుషాచల మందున
నెమ్మదిగా విడిచి పొమ్ము."

అని కశ్యపముని ఆనతి యిచ్చిన
వినతాసుతు డా కొమ్మను దాలిచి,
గజకచ్ఛపములు కాళ్ళకు వ్రేలగ
గగనంబున కువ్వెత్తుగ నెగసెను.






# 23

[కేశవుడూ, అతడి అనుచరులు గుహ కందరాల్లో పడి, తిరిగి తిరిగి కొంత సేపటికి బయిటికి వచ్చారు. జింకలను చంపేందుకు కారట్లాడు తున్న కొన్ని తోడేళ్ళు వాళ్ళ మీద పడినై. వాటిని చంపి, ముగ్గురూ అడవిలోకి బయలు దేరేంతలో, అన్ని వైపుల నుంచీ రాళ్ళూ, కర్ర ముక్కలూ జడివానలా వాళ్ళ మీదికి వచ్చి పడసాగినై. తరవాత]

కేశవుడు తను దాక్కున్న రాతి చాటు నుంచి మెల్లిగా పాకుతూ, జయమల్లూ, కోయ గోమాంగ్‌లు వున్న చోటుకు వెళ్ళి చిన్న గొంతుతో, "జయమల్లూ! మనం తిరిగి నరభక్షకుల వాతపడలేదు గదా?" అని ప్రశ్నించాడు.

జయమల్లు అడ్డంగా తలాడిస్తూ, "వీళ్ళు నరభక్షకులై వుండరు. ఇంత నిశ్శబ్దంగా, మన కంటికి కనపడకుండా దాగివుండి, మన మీద దాడి చేస్తున్నారంటే, వీళ్ళెవరో మరొకజాతి మానవులు. నరభక్షకులైతే పెద్ద రణగొణధ్వని చేసేవాళ్ళు," అన్నాడు.

కేశవుడు మరేదో మాట్లాడబోయేంతలో రాళ్ళుపడటం ఆగిపోయింది. ఒకటి రెండు క్షణాల నిశ్శబ్దం తరవాత, జయమల్లు వున్నచోటు నుంచి మోకాళ్ళమీద లేచి, ముందుకు చూశాడు. అతడితోపాటు కేశవుడూ, కోయగోమాంగ్ లేవబోయేంతలో,




చెట్ల చాటు నుంచి పెద్ద కేక వినబడింది: "వాళ్ళ ముగ్గుర్నీ ప్రాణాలతో పట్టుకోండి. రెక్కల మనుషులకు యిద్దాం. మన జాతి వాళ్ళు ముగ్గురు బతికినా బతికినట్టే!"

రెక్కల మనుషులు, మన జాతివాళ్ళు; అన్న మాటలు వింటూనే, జయమల్లు ఎగిరి లేచి నిలబడి, "ఇక అడవి లోపలికి పరిగెత్తుదాం రండి," అంటూ గుబురుగావున్న చెట్ల కేసి పరిగెత్తసాగాడు. కేశవుడూ, కోయగోమాంగ్ అతణ్ణి అనుసరించబోయేంతలో, దుక్కలా వున్న ఒక అడవిజాతివాడు పెద్ద కర్రతో గోమాంగ్ మీదికి వచ్చాడు. గోమాంగ్ ఆ కర్రతోనే, వాణ్ణి మెడ మీద గట్టిగా పొడిచి ముందుకు పరిగెత్తాడు. కేశవుడు కూడా అతణ్ణి అనుసరించాడు.

అడవిలోకి చాలా దూరం పరిగెత్తిన తర వాత ముగ్గురూ రొప్పుతూ రొస్తూ ఒక చెట్టు కింద కూచున్నారు. శత్రువులు తమను తరుముకురావటం లేదన్న నమ్మకం వాళ్ళకు కలిగింది. 'రెక్కల మనుషులు' అన్న మాట కోయగోమాంగ్‌కు బెదురు పుట్టించింది. అతడు కేశవుడి కేసి భయంగా చూస్తూ, "కేశవా, ఆ అడవిజాతివాళ్ళు అన్న మాటలు విన్నావు గదా? వాళ్ళకు రెక్కల మనుషులు తెలుసు!" అన్నాడు.

"అవును, రెక్కలమనుషు లేమిటి? ఇదేదో వింతగా వున్నదే!" అన్నాడు కేశవుడు.

"మీ యిద్దరూ అలాంటివాళ్ళు వున్నారని ఎప్పుడూ వినలేదా?" అని ప్రశ్నించాడు కోయగోమాంగ్.

కేశవుడూ, జయమల్లూ కూడా లేదన్నట్టు అడ్డంగా తలలు వూపారు.

"పక్షుల్లా ఎగిరే, రెక్కల మనుషులనే వాళ్ళు వున్నారు. కాని, ఎక్కడ వున్నారో మాత్రం మా కోయవాళ్ళకు తెలియదు. వున్నట్టు మాత్రం విన్నాం. వాళ్ళు మహా క్రూరులు," అన్నాడు కోయగోమాంగ్.

"పక్షుల్లాగా ఎగిరే మనుషులు వుండటం అసంభవం. నేను నమ్మను," అన్నాడు జయమల్లు.

"అయితే, ఆ అడవి మనుషులు వేసిన కేక అర్థం ఏమిటి?" అన్నాడు కేశవుడు.

"ఏమో! నా కర్థం కావటంలేదు," అంటూ జయమల్లు లేవబోయేంతలో, "అయ్యో, రెక్కలమనిషి, చచ్చాం!" అన్న పెద్ద ఆర్తనాదం వినబడింది.

ఆ ఆర్తనాదం వింటూనే ముగ్గురూ అటు కేసి పరిగెత్తారు. ఒక అడవిమనిషి ప్రాణ భయంతో వణికిపోతూ అరుస్తున్నాడు. అత డికి కొంచె ముందుగా నడుస్తున్న మరొకణ్ణి, చెట్టుకొమ్మ మీది నుంచి దూకిన పక్షిలాంటి పెద్ద ఆకారం ఒకటి, అంత ఎత్తుకు లేపి, దూరంగా విసిరివేసింది.

"రాకాసిపక్షి!" అంటూ కోయగోమాంగ్ కేకపెట్టాడు. అంతలో ముగ్గురూ కేకలు పెడుతున్న అడవిమనిషిని సమీపించి, "నీ స్నేహితుణ్ణి రక్షించే ప్రయత్నం ఏమీ చెయ్యక, అలా ఊరికే గగ్గోలుపడి పోతావేం!" అన్నారు.

ఆ మాటలు వింటూనే అడవిమనిషి చప్పున వెనుదిరిగి చూసి, ప్రాణం తేరు కున్నవాడిలా ముఖంపెట్టి, "రెక్కలమని






షికి చిక్కినవాణ్ణి రక్షించటం ఎవరితరం అవుతుంది? పైగా, వాళ్ళు మా గుహావాసుల మీద పగబట్టి వున్నారు. వాళ్ళ దేవత కోసం బలికి పంపవలసిన యిద్దర్ని మేం పంపలేదు." అన్నాడు.

జయమల్లు అందరికిన్న ముందుగా పరిగెత్తి, రెక్కలమనిషి విసిరివేసినవాణ్ణి సమీపించి, వాడిలో ఏమైనా ప్రాణం వుందో లేదో అని పరీక్షించి చూశాడు. కాని, వాడప్పటికే మరణించాడు.

"వీడు సగం భయంతో గుండెలాగి చచ్చాడని నా అనుమానం. అంత ఎత్తు నుంచి మనిషిపడితే, ఏ కాళ్ళు చేతులో విరగొచ్చు కాని, చావు యింత తొందరగా రాదు," అన్నాడు జయమల్లు.

"ఇంతకూ ఆ రెక్కలమని షెక్కడ?" అంటూ కేశవుడు చెట్టుకొమ్మల్లోకి చూశాడు.

"వా డింకెక్క డుంటాడు? ఆకాశంలోకి ఎగిరిపోయాడు," అన్నాడు అడవిమనిషి.

జయమల్లు ఆలోచనలో పడ్డాడు. అడవిమనిషిని చంపినవాడు రెక్కలమనిషి అనేందుకు సందేహం లేదు. పొడవైన పెద్ద రెక్కలూ, మామూలు మనిషికి వున్నట్టు కాళ్ళూ చేతులూ వాడికి వున్నవి. వాడు నిజంగానే ఆకాశంలోకి ఎగిరిపోగలడా? మనిషైనవాడికి అదెలా సాధ్యం? లేక వాడు గొప్ప మంత్రవేత్తా?

"ఆ ఎగిరేమనుషులు ఎందరుంటారు? ఎక్కడుంటారు?" అని ప్రశ్నించాడు జయమల్లు, అడవిమనిషిని. వాళ్ళు చాలా మంది వున్నారనీ, కాని, సంఖ్య తెలియదనీ చెప్పి, వాడు జయమల్లుకు పడమటి దిక్కు చూపిస్తూ, "అదుగో, ఆ కొండల వెనక ఎక్కడో వాళ్ళుండే ప్రదేశం వున్నది. అక్కడకు వెళ్ళి ప్రాణాలతో తిరిగివచ్చిన వాళ్ళెవరూ లేరు," అన్నాడు.

ఈ మాటలు వింటూనే జయమల్లు, కేశవుడి కేసి తిరిగి, "కేశవా! ఇందులో ఏదో

మోసం వున్నది. ఎగిరేమనిషంటూ ఎవడో ఒకడు...ఏ మంత్రశక్తివల్లనో, మరే అద్భుత సాధన వల్లనో వుండవచ్చుగాని—వందలా వేల సంఖ్యలో అలాంటి వాళ్ళు వుండేందుకు అవకాశంలేదు. ఈ రహస్యం ఏమిటో తెలుసుకోవాలి," అన్నాడు.

"అలాగే చేద్దాం. ఆ ఎగిరేశక్తి ఎలా వస్తుందో గ్రహిస్తే, మనం దారి పొడుగునా ఈ ప్రమాదాలకు గురి కాకుండా, సూటిగా ఎగిరిపోయి రాకాసిలోయలో వాలవచ్చు," అన్నాడు కేశవుడు.

హఠాత్తుగా వాళ్ళు నిలబడి వున్నచోటుకు అన్ని వైపుల నుంచీ పెద్ద కలకలం బయలు దేరింది. కనుమూసి తెరిచేంతలో, నలభై యాభై మంది అడవిమనుషులు పెద్ద పెద్ద ఈలెలు ఊపుతూ వాళ్ళను చుట్టుముట్టి, అంత దూరాన్నుంచే, "లొంగిపొండి. పారి పోయేందుకు ప్రయత్నించారో, చంపుతాం!" అంటూ కేకలు పెట్టారు.

కేశవుడు చప్పున తమ పక్కన నిలబడి వున్న అడవిమనిషిని ముందుకు లాగి, అతడి వెనక బాణం ఎక్కుపెట్టి నిలబడ్డాడు. జయమల్లూ, కోయగోమాంగ్ కూడా చెరొక వైపుకూ తిరిగి అడవిమనుషుల కేసి బాణాలు గురిపెట్టారు. జయమల్లు కంచు కంఠంతో,




"మేం ప్రాణాలతో మీకు దొరకటం కల్ల. మేం చచ్చే ముందు మీలో సగం మందిని చంపుతాం. మీతో మాకు శత్రుత్వం లేదు. మా దారిన మమ్మల్ని పోనివ్వండి," అని కేకపెట్టాడు. కేశవుడి ముందు నిలబడి వున్న అడవి మనిషి, తన జాతివాళ్ళ కేసి చేయి వూపుతూ, "వీళ్ళకేమీ హాని చెయ్యకండి. రెక్కల మనిషి నుంచి నన్ను కాపాడారు," అని అరిచాడు.

"కావాలంటే మీ గుహావాసులందర్నీ, రెక్కల మనుషుల నుంచి కాపాడగలం. మా బాణాలకు యీ లోకంలో తిరుగు లేదు," అన్నాడు కేశవుడు.





అడవిమనుషులంతా ఒకళ్ళను చూసి మరొకళ్ళు ఈటెలు దించారు. వాళ్ళ నాయకుడైన వృద్ధుడు ఈటెను తల కిందులుగా పట్టుకుని ముందుకు వస్తూ, "నిజంగా మీరు మాకు రెక్కలమనుషుల నుంచి రక్షణ కల్పించగలరా? ఎంతో కాలంగా వాళ్ళ దేవతకు రోజుకు యిద్దరు చొప్పున మా జాతివాళ్ళను బలికి ఒప్ప చెపుతున్నాం," అన్నాడు.

"మీకు రక్షణ యివ్వటమే కాదు, మొత్తం ఆ రెక్కల మానవజాతిని సర్వనాశనం చేస్తాం. మా మాట నమ్మండి," అన్నాడు జయమల్లు.

అడవిమనుషుల నాయకుడు, తన ఈటెను దూరంగా విసిరివేశాడు. అతడి అనుచరులంతా తమ ఈటెలను కూడా అదే ప్రదేశంలో ఒక గుట్టగా పడవేశారు. కేశవుడూ, అతడి స్నేహితులూ విల్లంబులు దించారు. అడవిమనుషుల నాయకుడు కేశవుణ్ణి సమీపించి, అతడి విల్లును పరీక్షించి చూస్తూ, "ఇలాంటి ఆయుధాలు వాడటం మా చేతకాదు. రెక్కలమనుషుల్లో కొందరు వీటిని ఉపయోగించటం చూసిన వాళ్ళున్నారు. మీరు నిజంగా వాళ్ళకు సమ ఉజ్జీలు. మాకు వాళ్ళ బెడద వదిలించండి. రోజుకు మా జాతి వాళ్ళిద్దర్ని పొట్టనపెట్టుకుంటున్నారు. మీకు మా చేతనైన సహాయం చేస్తాం," అన్నాడు.

"మీకు రాకాసిలోయకు దారి తెలుసా?" అన్నాడు కోయగోమాంగ్.

జయమల్లు కోపంగా అతణ్ణి వారించి, "ఆ సంగతులు మాట్లాడేందుకు యిది తగిన సమయం కాదు. సరే, రెక్కలమనుషులకు బలిగా రోజూ మీరు పంపే యిద్దర్నీ ఏ ప్రదేశంలో ఆ దుర్మార్గులకు ఒప్ప చెపుతారు?" అని అడిగాడు.

అడివిమనుషుల నాయకుడు తల ఎత్తి చెట్లచాటు నుంచి కొంచెంగా కనబడుతున్న



ఒక కొండ శిఖరాన్ని చూపుతూ, "ఆ ప్రదేశం యిక్కడికి అరకోసు దూరంలో వుంటుంది. చీకటి పడగానే, మేము నిర్ణయించిన మా జాతి వాళ్ళిద్దరు అక్కడికి వెళతారు. వాళ్ళను ఆ రెక్కల మనుషులు ఎత్తుకు పోతారు," అని చెప్పాడు.

"ఆ దుష్టు లెంతమంది అక్కడికి వస్తారు? ఏ విధంగా మీరు బలికి పంపిన వాళ్ళిద్దర్నీ ఎత్తుకుపోతారు?" అని జయమల్లు అడిగాడు.

"వాళ్ళెంతమంది వస్తారో, ఏ విధంగా ఎత్తుకు పోతారో చూసినవాళ్ళెవరూ లేరు. కాని, మా వాళ్ళను కాళ్ళతో పట్టుకుని, వాళ్ళు ఆకాశంలోకి లేచి పోతారని వదంతిగా చెప్పుకుంటారు. అందులో వున్న నిజం ఎంతో నాకు తెలియదు," అన్నాడు అడవి మనుషుల నాయకుడు.

"అయితే, యిక మీరు వెళ్ళి ఆ బలికి పంపేవాళ్ళను పంపండి. మా ప్రయత్నంలో మేముంటాం. రేపు ఉదయానికల్లా, మీరు పంపిన వాళ్ళిద్దర్నీ వెంట పెట్టుకుని రావటమేగాక, ఆ దుర్మార్గుల అసలు రహస్య మేమిటో కూడా తెలుసుకువస్తాం. ఇంతకూ, మీరుండే గ్రామం ఎక్కడ?" అని అడిగాడు జయమల్లు.




"మేము కొండ గుహల్లో నివశిస్తాం. మేము అనాదిగా గుహా వాసులం. మిమ్మల్ని కలుసుకునేందుకు రేపు సూర్యోదయానికల్లా యిక్కడికి వస్తాం," అన్నాడు గుహా వాసుల నాయకుడు. తరవాత అతడు తన అనుచరులతో వెళ్ళిపోయాడు. కేశవుడూ వాళ్ళు, కొండ శిఖరం కేసి నడిచారు. దారిలో కోయ గోమాంగ్ రెండు కుందేళ్ళను కొట్టి, వాటి కాల్చిన మాంసంలో తన స్నేహితు లిద్దరికీ భాగం పెట్టాడు.

ముగ్గురూ కొండ ప్రాంతానికి చేరేసరికి బాగా చీకటి పడిపోయింది. అంతలో చంద్రోదయ మయింది. ఆ వెలుగులో చెట్ల

నీడల కింద నడుస్తున్న వాళ్ళకు, కొంచెం ఎడంలో ఏదో అలికిడి అయిన ధ్వని విన బడింది. ముగ్గురూ పొదలచాటుకు వెళ్ళి నక్కి కూచున్నారు. అల్లంత దూరంలో, ఒక పెద్ద వృక్షం కింద యిద్దరు నిలబడివున్నారు. వాళ్ళల్లో ఒకడు రెండవ వాడికి ఏదో హెచ్చరిక చేశాడు. ఆ వెంటనే యిద్దరూ చెట్టు బోదె పట్టుకుని పైకి పాక సాగారు.

"చూశావా, వాళ్ళ రెక్కలు!" అన్నాడు కేశవుడు, మెల్లిగా జయమల్లుతో. జయమల్లు తల వూపాడు. అంతలో ఆ చెట్టు కేసి మరో యిద్దరు వస్తున్నారు. కోయ గోమాంగ్ వాళ్ళ కేసి పరీక్షగా చూసి, "వాళ్ళిద్దరూ గుహా వాసులు. రెక్కల మనుషుల దేవతకు బలి పశువులుగా పంపబడ్డవాళ్ళు," అన్నాడు.

"వాళ్ళను రక్షిస్తామని మనం మాట యిచ్చాం!" అన్నాడు కేశవుడు. జయమల్లు అవునంటూ తల వూపి బాణం ఎక్కు పెట్టి ముందుకు కదిలాడు. కేశవుడూ, గోమాంగ్ కూడా బాణాలు ఎక్కు పెట్టి ముందుకు నడిచారు.

"నాకు ఆ దుర్మార్గుల తంత్ర మేమిటో చాలావరకు తెలిసిపోయింది. వాళ్ళిద్దర్లో ఏ ఒకడూ ప్రాణాలతో పారిపోకూడదు. తెలిసిందా?" అన్నాడు జయమల్లు.

"వాళ్ళు గుహా వాసుల్ని తన్నుకుని ఆకాశంలో కి ఎగరక ముందే, మనం కొట్టాలి. అలా కాకపోతే మన బాణం దెబ్బకు అందరు," అన్నాడు కోయ గోమాంగ్.

అంతలో "రాకాసి పక్షిమాతకూ, జై!" అన్న అరుపు మాను చిటారు కొమ్మల్లో మారు మోగింది. ఆ వెంటనే రెండు నల్లని ఆకారాలు, రెక్కలు టపటప లాడిస్తూ, చెట్టు కింద నిలబడిన గుహా వాసుల మీదికి రాసాగినై. కేశవుడూ, జయమల్లూ, కోయ గోమాంగ్ వింటి తాళ్ళను చెవివరకూ లాగి, జయ్ మంటూ మూడు బాణాలను వాటి మీదికి వదిలారు. —(ఇంకా వుంది)






# కృతజ్ఞతారహితులు

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు మీది నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదలకు ఆనందమేగాని నీవు ఇంత శ్రమ పడి ఎవరికీ ఉపకారం చెయ్యవద్దని నా సలహా. ఎందుకంటే మనుషులకు కృతజ్ఞత అనేది ఉండదు. ప్రజలకు మేలు చేయబోయిన వాడు ఒక్కొక్కసారి తానే కీడు పొందుతాడు. ఇందుకు నిదర్శనంగా నీకు ప్రవాకుడనే కర్షకుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పుష్కరిణీ తీరాన ఒక కర్షకుల గ్రామం ఉండేది. ఆ గ్రామంలో నూరు కుటుంబాల వారుండేవారు. అందరూ రైతులే. వారిలో ప్రవాకుడనేవాడు ఒకడు. అతను సామాన్యపు రైతు. తన కున్నది కొద్దిపాటి పొలమే అయినా ఎంతో శ్రద్ధగా వ్యవసాయం చేసు

బేతాళ కథలు



కుని తన చుట్టు పక్కల పొలాల కన్న తన పొలం బాగా పండిందని పించుకునే వాడు.

ఒక ఏడు కోతల తరుణం సమీపిస్తున్న సమయంలో ప్రవాకుడు ఒకనాడు దూరపు గ్రామానికి వెళ్ళ వలిసి వచ్చింది. అతని పని అనుకున్నంత త్వరగా కాలేదు. అందుచేత అతను ఇంటికి వస్తుండగా దారిలోనే చీకటి పడింది. చలి కూడా హెచ్చింది. అతను పళ్ళ బిగువున కొంత దూరం నడిచి, దారిలో ఒక పాడుబడిన దేవాలయంలాటిది కనిపిస్తే ఆ రాత్రికి అక్కడే పడుకుందామనుకున్నాడు. అది చూడటానికి దేవాలయం లాగున్నప్పటికీ లోపల దేవుడి విగ్రహం ఏదీ లేదు. అది ఎవరు కట్టారో ఎప్పుడు కట్టారో ఎవరికీ తెలియదు. కొందరు దాన్ని వరుణుడి గుడి అనేవాళ్ళు.

ఆలయం లోపల వెచ్చగా ఉండటంచేత ప్రవాకుడికి నడుము వాల్చిన మరుక్షణమే నిద్ర మత్తు ఆవహించింది. ఆ మత్తులో నుంచి అతను ఉలిక్కి పడి లేచాడు. కారణ మేమంటే బయటి నుంచి ఎవరో పెద్దగా, "ఓహొూయ్!" అని కేక పెట్టిన చప్పుడు అతనికి వినిపించింది.

మరుక్షణమే ఆలయంలో నుంచి ఎవరో, "ఎవరు వారు?" అని కేక పెట్టారు.

"ఉరుముల రథం కావాలి. వెంటనే సిద్ధం చెయ్యండి," అని బయటి నుంచి జవాబు వచ్చింది.

"ఎవరికి కావాలట?" అని లోపలి గొంతు మళ్ళీ అడిగింది.

"దొరవారు పుష్కరిణీ తీరాన ఉదయమే విహారానికి వెళతారట," అని బయటి నుంచి జవాబు వచ్చింది.

"సరే, కొంచెం ఆగు!" అని లోపలి గొంతు చెప్పింది. ఈ సంభాషణ ప్రవాకుడికి ఏమీ అర్థం కాలేదు. అతను బయటికి తొంగి చూస్తే ఎవరూ కనిపించలేదు. కాని కొద్ది సేపటికి గరగరా చప్పుడు వినిపించింది.

అది రథం ఇరుసు చేసే చప్పుడు కావచ్చు, కాని వినటానికి మేఘ గర్జన లాగే ఉంది. చప్పుడయే దిక్కుగా చూస్తే తళుక్కున మెరవటం కూడా అతనికి కనబడింది.

అంతలోనే అతనికి ఇంకొక విషయం జ్ఞాపకం వచ్చింది. ఈ ఆలయం వరుణుడి గుడి అని చెప్పుకునేవారు. అదే నిజమైతే తెల్లవారుతూనే తమ గ్రామానికి వర్షం రావచ్చు. వర్షమే కురిస్తే పంట ధ్వంసం అయితీరుతుంది. శ్రద్ధా సక్తులు గల రైతు కావటాన అతను కీడెంచి మేలెంచాడు. ఇక ఒక్క క్షణంకూడా ఆగక ఆ అపరాత్రివేళ తన గ్రామానికి వెళ్ళి పడ్డాడు. అందర్నీ నిద్రలు లేపి, "తెల్లవారి వాన వస్తుంది. వెంటనే కోతలు కోసి కంకులు ఇళ్ళకు చేర్చుకుందాం పదండి!" అన్నాడు.

అతని మాట ఎవరూ నమ్మలేదు. కొందరు ఆకాశం కేసి చూసి, "వానారాదు, వంగుడూ రాదు," అన్నారు. మరికొందరు ప్రవాకుడేదో దొంగ ఎత్తు వేస్తున్నాడని కూడా ఆరోపణ చేశారు. అతను వాళ్ళతో వాదిస్తూ కూచోక వెంటనే బండి తీసుకుని పొలానికి వెళ్ళి తూర్పు తెల్లవారే లోపుగా తన పొల మంతా కోసి, మోపులు బండి మీద వేసుకుని ఇల్లు చేరుకున్నాడు.



ఆ రోజు ఆ గ్రామ వాసులు సూర్యోదయం చూడలేదు. సూర్యుడు ఉదయించ వలసిన సమయానికి కారు మబ్బులు ఎక్కడి నుంచో ముంచుకు వచ్చి రోజల్లా కుంభవర్షం కురిసింది. ఊళ్ళోవాళ్ళ చేలన్నీ మునిగి పోయాయి. బంగారంలాటి పంట కాస్తా పాడైపోయింది. రైతు లందరికీ కడుపులో చిచ్చు రేగింది. ప్రవాకుడి మాట విననందుకు పశ్చాత్తాప పడటానికి మారుగా వాళ్ళు అతనిపై కసి పట్టారు. తమ పొలాలన్నీ వానలో నాశనం కావటానికి అతనే కారణమని నిశ్చయించుకున్నారు. ఊరంతా ఏకమై తనపై పగ బడితే ఒంటరిగాడైన

ప్రవాకుడు మాత్రం ఏం చేస్తాడు? అతను ఊరు విడిచి వెళ్ళిపోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, మనుషులు ఇంత కృతజ్ఞతా రహితులుగా ఎందుకు తయారవుతారు? ప్రవాకుడు అందరినీ హెచ్చరించాడే తప్ప ఎవరికీ ద్రోహం చెయ్యలేదు గదా అతని మీద ఊరంతా ఏకమై ఎందుకు పగ పట్టాలి? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "చేసిన మేలుకు మనుషులు సామాన్యంగా కృతజ్ఞత చూపుతారు. కాని మేలు చేయ యత్నించిన మాత్రాన కృతజ్ఞత చూపరు. ప్రవాకుడు గ్రామానికి మేలు చేయ యత్నించాడేగాని నిజంగా మేలు చెయ్యలేక పోయాడు. గ్రామానికి రానున్న ప్రమాదం గురించి నమ్మ చెప్పటం అతనికి చేతకాలేదు. అది అలా ఉంచు. మిగిలిన గ్రామమంతా నష్టపడటం తప్పని సరి అని తెలిసికూడా ప్రవాకుడు తన ఒక్కడి పంటా రక్షించుకున్నాడు. గ్రామం వాళ్ళ దృష్టిలో ఇది స్వార్థం. కష్టమో, సుఖమో, నలుగురితో బాటు అనుభవించిన వాణ్ణే సంఘం ఆదరిస్తుంది. తన క్షేమం తాను చూసుకునే వాడు సంఘానికి తప్పక వెలి అవుతాడు. అయినప్పటికీ గ్రామస్తులు అతన్ని వెలివేసి ఊరుకోలేదు. ఇందుకు కారణం ఉన్నది. వాళ్ళు భయంకర నష్టానికి గురి అయారు. అందుకు ఎవరిపై ఆగ్రహించాలి? తమ మీద తాము ఆగ్రహించటం మానవ స్వభావం కాదు. వరుణ దేవుడి పై ఆగ్రహించి ఫలితం ఉండదు. అందుచేత వారు పగ బట్టటానికి ప్రవాకుడు ఒక్కడే మిగిలాడు," అన్నాడు.

ఈ విధంగా రాజుకు మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)






# గంధర్వ చక్రవర్తి కూతురు

## 4

హసన్ వెళ్ళినాక అతని భార్య రెండు రోజులపాటు అత్తగారిని అంటిపెట్టుకునే ఉంది. మూడోనాటి సూర్యోదయం వేళ ఆమె అత్తతో, "నాకు స్నానశాలకు వెళ్ళాలని ఉన్నది. మంచి స్నానం చేసి ఎంతో కాల మయింది," అన్నది.

"అవేం మాటలే, పిల్లా? ఈ ఊరు మనకు కొత్తాయె. స్నానశాల ఎక్కడో కూడా తెలియదాయె. ముందుగా వెళ్ళి ఏర్పాట్లు చెయ్యటానికి మీ ఆయన కూడా లేడాయె. ముసలిదాన్ని, నీకు తోడుకూడా రాలేనైతిని. కావాలంటే సుఖంగా తలంటి స్నానం చెయ్యటానికి కావలిసిన సరంజామా అంతా ఏర్పాటు చేసి నీళ్ళు కాస్తాను. ఇంట్లోనే హాయిగా స్నానం చెయ్యి. ఏ శ్రమా వుండదు," అన్నది హసన్ తల్లి.

"స్నానశాలకు వెళ్ళటానికి కూడా అభ్యంతరమైతే ఎలాగత్తా? బానిసలకైనా ఇన్ని కట్టుబాట్లుండవే! ఇలా బతికే కన్న చావు మేలుగదా!" అన్నది హసన్ భార్య.

తన కోడలు అంత మాట అన్నాక ముసలావిడ నొచ్చుకుని, స్నానానంతరం ధరించే బట్టలూ, పూసుకునే అత్తర్లూ తీసుకుని, "పదవే, అమ్మాయ్! నీ యిష్టప్రకారమే కానియ్యి. మీ ఆయనకు కోపం రాకుండా చూసే భారం ఆ అల్లాదే!" అంటూ కోడల్ని వెంట పెట్టుకుని, బాగ్దాదునగరంలో ఉండే స్నానశాల లన్నిటిలోకీ ప్రసిద్ధమైన దానికి తీసుకుపోయింది.

హసన్ భార్య స్నానశాలలోకి అడుగు పెట్టగానే అక్కడ ఉన్న ఆడవాళ్ళందరూ ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచి ఆమె కేసే చూడ

సి. మాధవరావు




సాగారు. కొందరు చేసేచేసే స్నానాలుకూడా మాని ఆమెను చూడ వచ్చారు.

ఇదే సమయంలో రాణి జుబేదా దాసి తూఫా అనే పిల్ల ఆ స్నానశాలలో ఉండటం తటస్థించింది. అది హసన్ భార్యను స్నాన శాలలో ఉన్నంతసేపూ కన్నార్పకుండా చూడటమేగాక, ఆమె తన అత్తగారితో సహా వెళ్ళిపోయేటప్పుడు వారి ఇంటిదాకా వెంట వెళ్ళి, ఆ తరవాత ఖలీఫా భవనానికి తిరిగి వచ్చి జుబేదా రాణితో తాను చూసిన స్త్రీ అందాన్ని వైనవైనాలుగా వర్ణించి చెప్పింది.

తూఫా సంగతి జుబేదాకు తెలుసును. అది కనిపించిన అందగత్తెనల్లా అంత ఆత్రంగా మెచ్చుకోదు, ఎవరి అందం గురించీ అంత పారవశ్యంతో మాట్లాడదు. అందుచేత ఈ అపురూపపు సౌందర్యరాశిని స్వయంగా చూడాలని జుబేదాకు బలమైన కోరిక కలిగింది. ఆ సౌందర్యవతి పేరు తూఫాకు తెలియదు గాని, ఆమె ఫలానా భవనంలో ఉంటున్నదని అది చెప్పింది.

ఖలీఫాకు అంగరక్షకుడుగా ఉండే మన్సూర్‌ను పిలిచి జుబేదా, "ఫలానా భవనానికి వెళ్ళి, అందులో ఉంటున్న స్త్రీని వెంటబెట్టుకురా. ఒక్కడవే తిరిగి వచ్చావో నీ తల ఎగిరిపోతుంది," అన్నది.

మన్సూర్ వెంటనే హసన్ ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు.

హసన్ తల్లి తలుపు తెరిచి, మన్సూర్‌ను చూసి, ఏంకావాలని అడిగింది.

"నా పేరు మన్సూర్. నేను ఖలీఫాగారి అంగరక్షకుణ్ణి. ఈ ఇంట్లో ఉండే అమ్మాయిని తీసుకురమ్మని మా రాణిగారి ఉత్తరువు!" అన్నాడు మన్సూర్.

హసన్ తల్లికి భయం పట్టుకున్నది. ఆమె కంపించిపోతూ, "నాయనా, మన్సూర్, మేము ఈ ఊరికి కొత్తవాళ్ళం. నా కొడుకు ప్రయాణం మీద వెళ్ళాడు. వెళుతూ తన భార్యను గడప దాటి వెళ్ళనివ్వ వద్దని మరీ

మరీ చెప్పాడు. అది బయటికి వెళ్ళితే ఏదో కీడు మూడుతుంది. దానికేదైనా జరిగిందో మావాడు బతకలేడు. ఏంజేతును?" అన్నది.

"ఏమీ భయంలేదమ్మా! మా రాణిగారు మీ కోడలి అంద చందాలు విని చూద్దామనే ఉద్దేశంతో పిలిపిస్తున్నారు. ఆ పిల్ల కేమీ రాకుండా నేను లేనా? క్షేమంగా తీసుకు పోయి క్షేమంగా తెస్తాను. ఇలా ఎంతమందిని తీసుకుపోయి ఇళ్ళ దగ్గిర దిగబెట్టాను కాను?" అన్నాడు మస్రూర్.

పరిస్థితి అనివార్యమైనదని హసన్ తల్లి గ్రహించింది. ఆమె లోపలికి వెళ్ళి తన కోడలికీ, మనమలకూ మంచి దుస్తులు వేసి అలంకరించింది. ఆ తరవాత వాళ్ళతోబాటు తానుకూడా మస్రూర్ వెంట ఖలీఫా మంది రానికి బయలుదేరింది.

వారు వచ్చి చేరే సరికి రాణి జుబేదా సింహాసనం మీద కూచుని ఉంది. ఆమె చుట్టూ అనేకమంది దాసీలున్నారు. వారిలో తూఫాకూడా ఉన్నది. జుబేదా హసన్ భార్యతో, "రా, అమ్మాయ్! ఇక్కడ మగ వారెవరూ లేరులే. నీ మేలిముసుగు తీసెయ్యో వచ్చు," అంటూ తూఫా కేసి చూసింది. తూఫా ముందుకు వచ్చి, హసన్ భార్య ధరించిన మేలి ముసుగును ఎంతో భక్తితో



తీసివేసింది. గంధర్వ చక్రవర్తి కుమార్తె ముఖం మబ్బుల చాటు నుంచి బయటికి వచ్చిన పౌర్ణమి చంద్ర బింబం లాగా ప్రకా శించింది. జుబేదా దాసీలు ఒక్కసారిగా ఆశ్చర్యంతో ఊపిరి పీల్చటం మరిచిపోయి, "ఏమిటీ అందం!" అని తమలో తాము గుసగుస లాడుకున్నారు.

జుబేదా తనను తానే మరచిపోయి, సింహాసనం మీది నుంచి లేచి, హసన్ భార్యను ఆలింగనం చేసుకున్నది. తరవాత ఆమెను సింహాసనం మీద కూర్చొబెట్టుకుని, తన మెడలోని పదిపేటల ముత్యాలహారాన్ని ఆమె మెడలో వేసింది. ఆ ముత్యాల హారం,




ఖలీఫాను పెళ్ళాడిన నాటి నుంచి జుబేదా మెడను అలంకరిస్తూ వచ్చింది; అది కాస్తా ఇప్పుడు హసన్ భార్యకు కానుక అయి పోయింది.

"అమ్మాయీ, నీకు ఆటలూ, పాటలూ, నృత్యాలూ తెలుసునా? నీవంటి దానికి అవి తెలియకుండా ఉండవులే!" అన్నది జుబేదా రాణి.

"సాధారణంగా ఆడపిల్లలు నేర్చుకునే పాటలూ, నృత్యాలూ లాటివి నాకేమీ రావు. కాని మీకు ఆశ్చర్యం కలిగించే విద్య ఒకటి నాకు తెలుసును—నేను పక్షిలాగా ఎగర గలను!" అన్నది హసన్ భార్య.

"అద్భుతం! ఆశ్చర్యం!" అన్నారు దాసీలంతా.

"రెక్కలు లేకుండా ఎలా ఎగురుతావు? నాకు చూడాలని ఉన్నది. ఒక్కసారి ఎగిరి చూపిస్తావా?" అని జుబేదా అడిగింది.

"రెక్కలు లేకపోవట మేమిటి? నాకు పక్షి తొడుగొకటి ఉన్నది. మా అత్తగారిని పంపితే ఆ తొడుగు తెస్తారు," అన్నది హసన్ భార్య.

జుబేదా ముసలావిడతో, "అమ్మా, మీరు వెళ్ళి ఆ పక్షి తొడుగుట, తెస్తారా? మీ కోడలు ఎగిరితే చూసి ఆనందిస్తాం," అన్నది.

హసన్ తల్లి గుండెల్లో రాయి పడింది. ఇక తమను అల్లా మాత్రమే రక్షించగలడని మనసులో అనుకుని ఆమె జుబేదాతో, "మనుషు లెవరైనా పక్షి తొడుగులు తొడుగు తారా? ఏలినవారి సమక్షంలో నా కోడలు మతి చలించి మాట్లాడుతున్నది. అంత కంటె ఇంకేమీ లేదు," అన్నది.

కాని హసన్ భార్య అమెకు అడ్డు వచ్చి, "నేను చెప్పిన పక్షి తొడుగు మా ఇంట ఎక్కడో భద్రంగా దాచి ఉన్నది. సరిగా వెతికితే కనిపించి తీరుతుంది," అన్నది.

జుబేదా వెలలేని తన చేతి ఆభరణం తీసి ముసలిదానికిస్తూ, "అమ్మా, ఆ తొడుగు

తీసుకురావాలి. లేకపోతే నా పైన ఒట్టు! ఎంతసేపు? ఒక్క క్షణంసేపు ఆనందించి ఆ తొడుగు మళ్ళీ మీకే ఇచ్చేస్తాను," అన్నది. కాని హసన్ తల్లి తనకా తొడుగు సంగతి తెలియదంటే తెలియదని మూర్ఖించే సరికి జుబేదాకు కోపం వచ్చింది. ఆమె మన్సూర్‌ను పిలిచి, హసన్ ఇల్లంతా గాలించి పక్షి తొడుగు ఎక్కడ ఉన్నా వెతికి తీసుకు రమ్మని ఆజ్ఞాపించింది. ఇంటి తాళపుచెవులను ముసలావిడ చేత మన్సూర్‌కు ఇప్పించింది.

మన్సూర్ ఇల్లంతా శోధించి చివరకు పక్షి తొడుగు సంపాదించి, తెచ్చి జుబేదా కిచ్చాడు. జుబేదా దాన్ని కొంచెం సేపు పరీక్షించి, దానిలోని పనితనాన్ని చూసి ఆశ్చర్యపడి, దాన్ని హసన్ భార్య కిచ్చేసింది. ఆమె దాన్ని అందుకుని, ప్రతి ఈకా పరీక్షించి, తొడుగు చెక్కు చెదరకుండా ఉన్నందుకు సంతోషించి దానిని ధరించింది. తరవాత ఆమె తేలికగా గాలిలోకి లేచి హాలు ఈ చివర నుంచి ఆ చివరకు ఎగిరి వచ్చి నేల మీద వాలింది. ఆమె తన ఇద్దరు కొడుకులనూ తీసుకుని చెరొక భుజానా పెట్టుకుని ఎత్తుగా ఉన్న గవాక్షానికి ఎగిరి, అక్కడ వాలి, "నేను పోతున్నాను, నాకు సెలవిప్పించండి," అన్నది. హసన్ తల్లి తివాసీ





మీద కుప్ప కూలిపోయి కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తున్నది. కోడలు ఆమెతో, "అత్తా, నేను మిమ్మల్నీ మీ అబ్బాయినీ వదిలి వెళ్ళిపోతున్నాను. మిమ్మల్ని గురించి నాకు బాధగానే ఉంది. కాని ఏంచెయ్యను! ఎగరటంలో ఉన్న నిషా నన్ను ఆవహించే సింది. నేను ఎగిరి తీరాలి. మీ అబ్బాయి నన్ను వెతకదలిస్తే వాక్—వాక్ దీవులలో వెతకవచ్చు. సెలవు!" అంటూ గవాక్షం కుండా తన పిల్లలతో సహా ఆకాశంలోకి ఎగిరి పోయింది. స్పృహ తప్పి పడి ఉన్న హసన్ తల్లిని జుబేదా చేత్తో తాకి లేపి, "అమ్మా, అసలు ఏమీ తెలియనట్టు నటించకపోతే, పర్యవసానం ఇలా అవుతుందని నాకు ముందే చెప్పి ఉండరాదా? ఇంత దాకా రానివ్వక పోదునే! తెలియక చేసిన ఈ పొరపాటును క్షమించాలి," అన్నది.

"తప్పంతా నాదే. తమరిని నేను క్షమిం చటమేమిటి? నేనూ, నా కొడుకూ దుఃఖంతో కుమిలి చావాలని రాసిపెట్టి ఉన్నది ఇంతకూ!" అంటూ హసన్ తల్లి తన ఇంటికి కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోయింది. ఒక వేళ తన కోడలూ, మనవలూ కనిపిస్తారేమోనన్న భ్రమతో ఇల్లంతా వెతికింది. కాని వారెందుకు కనిపిస్తారు? ఆమె ఒక పెద్ద సమాధీ, రెండు చిన్న సమాధులూ ఇంట్లో కట్టించి వాటి చెంతనే అహోరాత్రాలు ఏడుస్తూ కొస ప్రాణంతో ఉండిపోయింది.

అక్కడ హసన్ ఏడుగురు రాజకుమార్తె లతో మూడు నెలలు గడిపి, తన కోసం తన భార్యా, తల్లీ నిరీక్షిస్తూ ఉంటారనే బెంగతో తన "అక్కలకు" వీడ్కోలు చెప్పి, డప్పు మోగించి, ఒంటెలను రప్పించి, రాజకు మార్తెలిచ్చిన బంగారమూ, వెండీ, రత్నాలూ వాటిపైన పెట్టించి, త్వరలోనే బగ్దాదు నగరానికి తిరిగి వచ్చాడు.

అతను ఇంట్లో ప్రవేశించి తన తల్లిని గుర్తించలేక పోయాడు. తరవాత ఆమెను,

"నా భార్య ఏదీ? పిల్లలేరీ?" అని అడిగాడు. ఈ ప్రశ్నకు జవాబుగా తల్లి పెద్ద పెట్టున ఏడవసాగింది. హసన్‌కు మతి పోయినట్టయింది. అతను ఇల్లంతా గాలించటంలో, తన భార్య తాలూకు పక్షి తొడుగు దాచి ఉంచిన పెట్టె ఖాళీగా కనిపించింది, మూడు కొత్త సమాధులు కనిపించాయి. వాటిని చూస్తూనే అతను ఒక్క కేకపెట్టి విరుచుకు పడి పోయాడు.

తల్లి ఎన్ని ఉపచారాలు చేసినా హసన్‌కు రాత్రిపడిన దాకా తెలివిరాలేదు. తెలివి వచ్చాక అతను తన బట్టలు చించుకున్నాడు. నెత్తిన దుమ్మూ, బూడిదా చల్లుకున్నాడు, కత్తితో పొడుచుకుని చావ యత్నించాడు—కాని తల్లి అడ్డుపడింది. ఆమె అతన్ని చిన్న పిల్లవాణ్ణి పొదివినట్టుగా దగ్గిరికి తీసుకుని, జరిగినదంతా చెప్పి, "నాయనా, నువు బొత్తిగా నిరాశపొంద నవసరంలేదు. వాక్-వాక్ దీవులకు వెళితే నీ భార్య దొరక వచ్చు," అన్నది.

ఈ మాట వింటూనే హసన్‌కు కొత్త ప్రాణం వచ్చినట్టయింది. అతను చివాలున లేచి నిలబడుతూ, "అమ్మా, నేనిప్పుడే వాక్-వాక్ దీవులకు ప్రయాణ మవుతున్నాను," అన్నాడు.




కాని పక్షికూతలాటి పేరు గల దీవులు ఎక్కడ ఉంటాయి? వీటి కోసం ఇండియా వెళ్లాలా? పర్షియా వెళ్ళాలా? చీనా వెళ్ళాలా? అతని కేమీ తెలియదు.

అతను తిన్నగా ఖలీఫాగారి దర్బారుకు వెళ్ళి అక్కడ ఉన్న పండితు లందరినీ వాక్-వాక్ దీవులు ఏ సముద్రంలో ఉంటాయని అడిగాడు. కాని ఒక్కరికీ తెలియదు, ఒక్కరైనా ఆ దీవులను గురించి విని ఉండ లేదు. అతనిలో మొలకెత్తిన ఆశ అంతలోనే నశించిపోయింది. "ఇంక నేను పోయేది ఏకంగా పితృలోకానికే!" అనుకుంటూ అతను ఇంటికి వెళ్ళి పడుకున్నాడు.






ఏడుగురు అప్పచెల్లెళ్ళూ ముఖముఖాలు చూసుకుని తలలు వంచుకున్నారు. చివరకు వారు, "హసన్, చెయ్యి ఎత్తి స్వర్గాన్ని తాకటమైనా నీకు సాధ్యమవుతుందేమో గాని, వాక్-వాక్ దీవులకు వెళ్ళటం సాధ్యం కాదు," అన్నారు. హసన్ పెట్టుకున్న ఆశ లన్నీ అడుగంటి పోయాయి. దుఃఖావేశం ముంచుకొచ్చింది.

అతన్ని పెంచుకున్న ఆఖరు రాజ కుమార్తె ఊరడించి, "నీకు నీ భార్యా, బిడ్డలూ దక్కే యోగం ఉంటే ఏదో ఒక ఉపాయం దొరకకపోదు, హసన్. మేము మాకు చేతనయినదంతా చేస్తాము గాని చేతులు కట్టుకు కూర్చోము, దిగులుపడకు," అని ధైర్యం చెప్పింది.

ఈ రాజకుమార్తెలకు అబ్దల్ కద్దూస్ అని ఒక మేనమామ ఉన్నాడు. ఆయన ఏడాది కొకసారి తన మేనగోడళ్ళను చూడ వస్తాడు. ఆయనను అవసరంపడి పిలవా లంటే ఒక రకమైన గుగ్గిలం నిప్పులో వెయ్యాలి. ఆ గుగ్గిలం పెద్ద రాజకుమార్తె వద్ద ఉన్నది. దానిని కొంచెం తీసి నిప్పుల మీద వెయ్యగానే పెద్ద సుడిగాలి వీచింది. అది అణగారి పోగానే తెల్ల ఏనుగు నెక్కి అబ్దల్ కద్దూస్ చక్కా వచ్చాడు.

కాని అంతలోనే మళ్ళీ కొత్త ఆశ చిగిర్చింది—అతనికి రాజకుమార్తెలు జ్ఞాపకం వచ్చారు. అతను తల్లికి మళ్ళీ వీడ్కోలు చెప్పి ఒంటెను పిలిచి దానిపై తన అక్కల వద్దకు బయలుదేరి వెళ్ళాడు. అతను అంత త్వరగా తిరిగి వచ్చినందుకు వాళ్ళు పరమానందం చెందారు. అతను వారితో జరిగిన దంతా చెప్పి శోకంతో వివశుడై పోయాడు. వారు అతన్ని ఊరడించారు.

"వాక్-వాక్ దీవులకు వెళ్ళే మార్గం నాకు చెప్పండి. అక్కడ విచారిస్తే తన జాడ తెలుస్తుందని నా భార్య వెళ్ళిపోయేటప్పుడు చెప్పిందట," అన్నాడు హసన్.





"నేను వచ్చి ఏడాది అయింది. రేపు బయలుదేరి వద్దామనే అనుకుంటున్నాను. ఇంతలో మీరే పిలిపించారు. ఏదో విశేషం ఉండాలి. ఏమిటది?" అని ఆయన తన మేనగోడళ్ళ నడిగాడు.

"మరేం లేదు, నీ వల్ల మా కొక సహాయం కావాలి," అన్నారు రాజకుమార్తెలు.

"ఇచ్చేశాను! ఏమిటా సహాయం?" అన్నాడాయన.

వారు ఆయనకు హసన్ కథ అంతా వివరంగా చెప్పి, "మా తమ్ముడు హసన్ వాక్-వాక్ దీవులకు వెళ్ళే మార్గం నువ్వు చెప్పాలి," అన్నారు.

ఆయన మూతి మీద వేలు వేసుకుని, తల వంచి దీర్ఘాలోచన చేసి, ఏమేమిటో గుణించుకుని చివరకు, "లాభం లేదు. మీ తమ్ముడు అసాధ్యం తలపెట్టాడు. అతను వాక్-వాక్ దీవులు చేరటం అసంభవం," అనేశాడు.

"ఈ మాట అతని బుద్ధికి అంటేలాగు చెప్పు. నీ సలహా కూడా ఇయ్యి," అన్నారు రాజకుమార్తెలు.

అబ్దల్ కద్దూస్ హసన్‌తో, "నాయనా, తోకచుక్కలూ, సంచారగ్రహాలూ కూడా నిన్ను వాక్-వాక్ దీవులకు చేర్చ లేవు. ఆ దీవులలో గంధర్వ చక్రవర్తి భద్రుడై ఉంటాడు. ఆ దీవులను సైనిక కన్యల మూకలు కాపాడుతూ ఉంటాయి. సప్త సముద్రాలూ, సప్త నగాలూ దాటితేనే గాని ఆ దీవులను చేరలేవు. అక్కడికి వెళ్ళటం నీకు అసాధ్యం. అందుచేత ఆ ప్రయత్నం మాని నీ అక్కలతో సుఖంగా కాలక్షేపం చేస్తూ ఇక్కడే ఉండిపో! లేనిపోని ప్రమాదాలెందుకు కొని తెచ్చు కుంటావు?" అని హితం చెప్పాడు.

ఈ మాటలు విని హసన్ ముఖం పాలి పోయింది. అతను పెద్దపెట్టున కేక వేసి విరుచుకు పడిపోయాడు. అతన్ని చూసి

అబ్దుల్ కద్దూస్‌కు జాలి కలిగింది. హసన్‌కు స్పృహ తెలియగానే ఆయన అతని భుజం మీద చెయ్యి వేసి, "నీ సంగతి ఇలా వది లెయ్యటం నాకే బాగాలేదు. ఏదైనా దారి ఉందేమో చూస్తాం, నా వెంట వస్తావా?" అని అడిగాడు.

హసన్‌కు మళ్ళీ ప్రాణం వచ్చినట్ట యింది. అతను ఎగిరి గంతేసి ముసలాయ నను వెంబడించాడు. ఇద్దరూ తెల్ల ఏనుగు పైకెక్కి కూచున్నారు. కద్దూస్ దాని చెవిలో ఏదో చెప్పాడు. వెంటనే ఏనుగు గాలిలోకి లేచి, అద్భుత వేగంతో ప్రయాణించి, నీలి పర్వతం చేరుకున్నది. నీలి పర్వతంలో ఒక గుహా, దానికి నీలం రంగు గల ఉక్కు తలుపూ ఉన్నాయి. వృద్ధుడీ తలుపు తట్ట గానే నీలచ్ఛాయ గల ఒక నీగ్రో, నీలి ఖడ్గమూ, నీలి డాలూ పట్టుకుని వచ్చాడు. వృద్ధుడు రెప్పపాటులో వాడి కత్తి, డాలూ లాగేసి అవతల పారేశాడు. వెంటనే నీగ్రో వాడు వారికి దారి ఇచ్చాడు. ఇద్దరూ గుహలో ప్రవేశించినాక వాడు ఎప్పటిలాగా తలుపు మూశాడు.

గుహ మార్గంకుండా వారు ఒక మైలు దూరం వడిచాక రెండు వాకిళ్ళు కనిపిం చాయి. రెంటికీ బంగారు తలుపు లున్నాయి. అబ్దుల్ కద్దూస్ ఒక వాకిలి తలుపులు తోసి



లోపలికి వెళ్ళిపోయాడు. ఆయన ఆదేశాను సారం హసన్ వెలపలనే ఉండిపోయాడు.

ఒక గంట గడిచాక ఆయన ఒక గుర్రాన్ని వెంటపెట్టుకుని బయటికి వచ్చాడు. గుర్రమూ, దాని జూలూ కూడా నీలంగానే ఉన్నాయి. ఆయన హసన్‌ను ఆ గుర్రం ఎక్కమని రెండవ ద్వారం తెరిచాడు. ఆ ద్వారం అవతల నీలాకాశం తప్ప మరేమీ లేదు.

"నాయనా, ఆఖరుసారి ఆలోచించి నిర్ణయించుకో. నీకు ఘోరప్రమాదాలు ఎదురవుతాయి. వాటిని ఎదుర్కొంటావా? లేక మీ అప్పల దగ్గిరికి తిరిగి వెళ్ళిపోతావా?" అని ఆయన హసన్‌ను అడిగాడు.

"వెయ్యి మరణాలనైనా ఎదుర్కొంటాను," అన్నాడు హసన్.

"కని పెంచిన మీ అమ్మ కోసమైనా వెనక్కు తిరిగి వెళ్ళవా?" అని వృద్ధుడు అడిగాడు.

"నా భార్యనూ, పిల్లలనూ వెంట తీసుకోకుండా మా అమ్మ వద్దకు తిరిగి వెళ్ళను," అన్నాడు హసన్.

"అలాగే కానీ, హసన్. ఈ ఉత్తరం తీసుకో. గుర్రాన్ని నీవు నడప నవసరం లేదు, దానికి దారి తెలుసు. అది నిన్ను నల్ల పర్వతం వద్ద దించుతుంది. నల్ల గుహ వద్ద దిగి గుర్రాన్ని గుహలోకి వెళ్ళిపోనియ్యి. ఒక వృద్ధుడు బయటికి వస్తాడు. ఆయన నిలువునా నల్లగా ఉంటాడు, కాని మోకాళ్ళదాకా పెరిగిన తెల్లటి గడ్డం ఉంటుంది. ఆయనకు వందనం చేసి ఈ ఉత్తరం ఇయ్యి. ఆయన పక్షులకు రాజు, నాకు పైవాడు. ఆయన సహాయం లేకుండా నీ పని సానుకూలం కావటం అసంభవం. ఆయన మెప్పుపొందు," అని అబ్దల్ కద్దూస్ గుహ ప్రవేశించాడు. నీలం గుర్రం గట్టిగా సకిలించి ఆకాశంలోకి ఎగిరింది.

—(ఇంకా వుంది)







# దయ్యాలను పట్టిన మనుషులు

పిల్లలు దయ్యాలను గురించి చర్చించుకుంటున్నారు.

"ఈ కథ వొట్టి అబద్ధం, అసలు దయ్యాలు లేవు," అన్నా డొకడు. దిబ్బ మీద రామమ్మకి పట్టింది దయ్యం కాకపోతే ఏమిటని మరొకరు అడిగారు. దయ్యాలున్నాయో లేవో గాని, అవంటే నాకు భయం అన్నది చిట్టి. దయ్యాలున్నాయి గాని, అవంటే నాకు భయమే లేదు అన్నాడు బుల్లివాడు.

వాళ్ళు మాట్లాడు కుంటూండగానే తాత వచ్చి వాళ్ళ సంభాషణ విన్నాడు.

"నువు చెప్పు, తాతా. దయ్యాలున్నాయా, లేవా? వాటిని చూస్తే మనకు భయమా కాదా?... నీకు దయ్యాలంటే భయమేనా?" అని పిల్లలు తాతయ్యను ప్రశ్నలలో ముంచేశారు. తాతయ్య కుర్చీలో కూచుంటూ, "దయ్యా లుంటే వాటి మానాన వాటిని ఉండనివ్వండి. వాటి జోలి మనకొద్దు, మన జోలి వాటి కొద్దు," అన్నాడు.

"ఒకవేళ దయ్యాలు మనని పట్టేస్తే? మనం వాటికి కనిపిస్తామాయె, మన కవి కనిపించవాయె!" అన్నాడు పెద్దబ్బాయి.

"ఎవర్రా చెప్పిందీ? మనం వాటిని చూడలేం. అవి మనని చూడలేవు. ఎప్పుడైనా దారి తప్పి అవి మనని పట్టినట్టే మనం కూడా వాటిని పట్టవచ్చు. అప్పుడు వాటి కెంత చిక్కో చూడూ!" అన్నాడు తాతయ్య.

"మనుషులు దయ్యాలను పట్టటమా?" అన్నది పెద్దమ్మాయి.

"అవి కూడా మనని చూసి భయపడతాయా, తాతయ్యా?" అన్నాడు బుల్లాడు.

"భయపడవూ మరీ? వెనకటి కోసారి," అంటూ తాతయ్య పొడుంకాయ పైకి తీశాడు.

"కథ, కథ!" అంటూ పిల్లలు తాతయ్య చుట్టూ సర్దుకుని కూచున్నారు.



తాతయ్య తాపీగా పాడుం పీల్చి కథ ఆరంభించాడు :

అయిదారు వందల ఏళ్ళ క్రితం రత్న శెట్టి అని ఓ గొప్ప వ్యాపారస్థు డుండేవాడు. ఆయన ఓడ మీద సువర్ణద్వీపమూ, రత్నాల ద్వీపమూ, పగడాలద్వీపమూ మొదలైన ద్వీపాలన్నీ తిరిగి లక్షలూ, కోట్లూ గడించు కున్నాడు. ఆశకు అంతేముందీ ? ఆ రత్నశెట్టి అరవయ్యో ఏట షష్టిపూర్తి చేసుకుని, "ఇంకొక్కసారి సముద్ర వ్యాపారం చేసి వచ్చి ఆ తరవాత ఇంటి దగ్గిర కుదురుగా కూచుంటా," అన్నాడు. ఓడ సిద్ధం చేశారు. సరు కెక్కించారు. పడవ ముత్యాలదీవి కేసి బయలుదేరింది. రెండు వారాలు ప్రయాణం చేసి ఓడ నడి సముద్రంలో ఉండగా సముద్రం మీద సుడిగాలి లేచింది. ఆకాశ మంతా కారు మబ్బులు కమ్మాయి. పడవ బొంగరంలా తిరుగుతూ పోసాగింది.

పడవలో ఉన్న వాళ్ళకి తూర్పేదో, పడమరేదో కూడా తెలిసింది కాదు. సుడి గాలి కాస్తా హెూరు గాలిగా మారింది. తుపాను కింద దించింది. ఓడ ఎటో పడి కొట్టుకు పోసాగింది. ఎన్నిసార్లో సముద్రం అలలు ఓడను ముంచెయ్య యత్నించాయి.

కొన్ని రోజుల అనంతరం తుఫాను కాస్తా తీసింది. ఆకాశం బయట పడింది. సూర్యుడు కూడా ఉదయించాడు. సూర్యుడు ఉద యించే వైపుగానే ఓడలో వాళ్ళకు ఎగుడు దిగుడుగా నేల కూడా కనిపించింది.

"బాబూ, ఆ కనిపించేది ఏ దేశం?" అని ఓడ సరంగూ, కళాసులూ రత్నశెట్టిని అడిగారు.

"అది నే నెన్నడూ చూసిన దేశం మటుకు కాదు. ఏ దయ్యాల లంకో అయి ఉంటుంది," అన్నాడు రత్నశెట్టి.

ఎవరూ నమ్మలేదు. క్రమంగా ఓడ తీరాన్ని చేర వచ్చింది. ఇప్పుడు వాళ్ళకు నేల మీద ఒక కొండా, దాని మీదా, కిందా

చెట్లూ, చెట్ల మధ్య గరిక మేసే గొర్రెలూ, ఒక పక్క పొలాలూ, దూరాన ఒక నగ రమూ, దాని ప్రాకారమూ అన్నీ స్పష్టంగా కనిపించాయి.

"ఇది దయ్యాల లోకం ఎందు కయింది? కానే కాదు. ఆ గొర్రెలు దయ్యపు గొర్రెలా? ఆ పొలాలలో పండేది దయ్యపు ధాన్యమా? కానేకాదు," అన్నారు కళాసులు.

రత్నశెట్టి దానికి జవాబివ్వక, "దయ్యాల లంక అయినా, భూతాల లంక అయినా మనం దీని మీదికి వెళ్ళక తప్పదు. ఇక్కడి వాళ్ళ సహాయం లేకుండా మనం ఇంటి కెలా వెళ్ళగలం?" అన్నాడు.

అది నిజమేగా మరీ? అందుచేత రత్న శెట్టి వెంట, ఓడ సరంగూ, మరి కొందరు ముఖ్యులూ బయలుదేరారు. కళాసుల్లో కొందరు మంచి నీటి కోసం వెతుకుతూ వెళ్ళారు. మిగిలిన వాళ్ళు ఓడకు కాపలాగా ఉండిపోయారు

రత్నశెట్టి ముఠావాళ్ళు ఒక కాలి బాట పట్టుకున్నారు. అది చెట్ల మధ్యగా నగరం కేసి పోతున్నది. ఒకళ్ళ వెనకగా ఒకళ్ళు నడుచుకుంటూ ఆ బాట వెంట వాళ్ళు కొంత దూరం వెళ్ళేసరికి, బాట పక్కగా ఒక కూరల మడిలో కలుపుతీస్తూ ఒక ముస



లాడు కనిపించాడు. రత్నశెట్టి ఆగి, "చూడు, బాబూ, ఈ దారే పోతే మేం నగరం చేరు కుంటామా?" అని అడిగాడు.

ముసలివాడు తల ఎత్తి వాళ్ళకేసి చూడ నన్నా చూడలేదు. వాడికి చెవుడు కాబో లనుకుని వాళ్ళు మరి కొంతదూరం వెళ్లారు. ఒక యువకుడు పార భుజాన తగిలించు కుని ఆ దారి వెంటే వాళ్ళకు ఎదురు వచ్చాడు. మనవాళ్ళు వాడికి దారి ఇచ్చారు.

ఎవరో కొత్తవాళ్ళు ఎదురైనప్పుడా కుర్ర వాడు ఆగి, "ఎవరు మీరు? ఏ దేశం?" అని అడగవచ్చునా? వాడు వాళ్ళను ఏమీ అడగలేదు సరేగదా, వాళ్ళ కేసి కన్నయినా



తిప్పకుండా తన దారిన తాను వెళ్ళి పోయాడు. గుడ్డివాడా అనుకుందామంటే దారి వెంట ధారాళంగా నడిచేస్తున్నాడు.

మనవాళ్ళు వాడి కేసి చూస్తూ అలాగే ఆశ్చర్యంతో నిలబడి ఉండగా, వెనక నుంచి తప్పటడుగులు వినిపించాయి. నలుగు రైదుగురు పిల్లలు వాళ్ళకుండా పరిగెత్తి పోయారు! ఆ పిల్లల శరీరాలు మన వాళ్ళకి తగల్లేదు, మనవాళ్ళ శరీరాలు వాళ్ళకీ తగల్లేదు. ఇంకేముందీ? రత్నశెట్టి చెప్పిన మాట అక్షరాలా నిజమయింది. అది దయ్యాల దేశం. వాళ్ళకు దారిలో కనిపించిన వాళ్ళం దరూ దయ్యాలే.

"నేను చెప్పలేదా? ఇది ఏదో దయ్యాల లంక," అన్నాడు రత్నశెట్టి.

"అమ్మయ్యో, మనం ఇక్కడ ఒక్క క్షణం ఉండవద్దు. లంగరెత్తి ఇప్పుడే వెళ్ళి పోదాం," అన్నారు మిగిలినవాళ్ళు.

"భయం దేనికర్రా? మననా ఈ దయ్యాలు చూడలేవు! ఇది వాళ్ళ ప్రదేశం గనక వాళ్ళను మనం చూడగలుగుతున్నాం. దైవికంగా మనం ఇక్కడికి వచ్చామే గాని పనిపెట్టుకుని రాగలమా? ఇక్కడి విశేషాలు చూసి మరీ పోదాం. మనం దేశం వెళ్ళాక అందరితోటీ దయ్యాల దేశానికి వెళ్ళొచ్చా మని ఎలాగూ చెబుతాం. అక్కడి విశేషా లేమిటని అడిగితే, ఏమో, మాకు తెలియ దంటామా? అవమానం కాదూ?" అన్నాడు రత్నశెట్టి. ముసలివాడూ, కోటీశ్వరుడూ అయిన శెట్టికి లేని భయం మన కెందుకను కుని మిగిలిన వాళ్ళు ఆయన వెంట బయలు దేరారు. పోగాపోగా నగరద్వారం వచ్చింది.

ద్వారం వద్ద విచ్చు కత్తులతో పహరా వాళ్ళున్నారు.

"మనం వాళ్ళకి కనపడం. మన మాటలు వాళ్ళకి వినపడవు. జంకక పదండి," అంటూ శెట్టి దారితీశాడు. విచ్చు కత్తులవాళ్ళు వారిని చూడాలేదు, అడ్డాలేదు.

పోగా పోగా రాజ భవనం వచ్చింది. శెట్టి నిర్భయంగా లోపలికి దారి తీశాడు. వాళ్ళు పహరావాళ్ళ శరీరాల కుండానే లోపలికి వెళ్ళారు. అది దయ్యాల రాజు భవనం. బయటా, లోపలా కూడా ఆ భవనం చాలా అందంగా ఉన్నది. బయట మహా అంద మైన పూలు గల చెట్లు. లోపలి నుంచి సంగీతం వినిపిస్తున్నది.

శెట్టి తన అనుచరులతో సహా సంగీతం వినిపిస్తున్న చోటికి వెళ్ళాడు. ఒక పెద్ద చావడిలో చాలామంది జనం ఉన్నారు. ఒక పక్కగా రాజూ, రాణీ, రాజ బంధువులూ, ఉన్నతోద్యోగులూ విందు చేస్తున్నారు. ఇంకొక పక్కగా పాడేవాళ్ళు పాడుతున్నారు, నృత్యాలు చేసేవాళ్ళు నృత్యాలు చేస్తు న్నారు. మహా వైభవంగా ఉన్నది.

"తమాషా చేస్తాను, చూస్తూ ఉండండి," అని తన అనుచరులతో చెప్పి రత్నశెట్టి తిన్నగా రాజు దగ్గిరికి వెళ్ళి ఎదురుగా నిల బడ్డాడు. శెట్టి ఇంకా దగ్గిరికి వంగి రాజు మొహంలో మొహంపెట్టి చూశాడు. అప్పుడు కూడా రాజు శెట్టిని గమనించలేదు, కాని శెట్టికి ఆశ్చర్యం కలిగేటట్టుగా ఆయన స్పృహ తప్పి పడిపోయాడు. హాహాకారాలు బయలుదేరాయి. నృత్యగానాలూ, నవ్వులూ,



వికవికలూ, అన్నీ నిలిచిపోయాయి. అందరూ, "ఏం జరిగింది? ఏం జరిగింది?" అంటూ రాజు దగ్గిరికి వచ్చారు.

మంత్రి వచ్చి రాజును చూసి, "భోజ నంలో ఏదో విషం కలిసి ఉంటుంది," అంటూ రాజ వైద్యుణ్ణి పిలిపించాడు.

రాజ వైద్యుడు వచ్చి రాజుగారు తింటున్న పదార్థాలు మొదట వాసన చూసి, తరవాత నోట్లో వేసుకు చూసి, "ఇందులో విషం ఏమీ లేదు. భూత వైద్యుణ్ణి పిలిపించండి," అన్నాడు. భూతవైద్యుడు వచ్చాడు. రాజు గారి కేసి ఒక్కసారి చూసి, "గాలిచేష్ట. అంతకంటె ఏమీలేదు," అన్నాడు.

"గాలిచేష్ట అంటే ఏమిటి?" అని మంత్రి అడిగాడు.

"మహారాజుగారికి మనుషుల గాలి తగిలింది. అందువల్ల స్పృహ తప్పి పడిపోయారు. మన మధ్యకు ఎలా వచ్చారో మనుషులు వచ్చారు. వారిని సాగనంపితే గాని మహారాజుగారు స్పృహలోకి రారు," అన్నాడు భూతవైద్యుడు.

వెంటనే మంత్రి చేతులు జోడించి, తల పైకెత్తి, కళ్ళు మూసుకుని, "మా మధ్యకు వచ్చిన మానవుడా! మాకు అపకారం చెయ్యక నీ దారిన నీవు వెళ్ళిపో! నీకేం కావలిస్తే అది ఇస్తాం. బోలెడంత ఆహార పదార్థం ఉంది; తిను, నీకు కావలిసినంత పట్టుకుపో!" అని ప్రార్థించాడు.

భూతవైద్యుడు ఒక పక్కన రాజుగారిని పడుకోబెట్టి మంత్రాలు చదువుతూంటే శెట్టి మొదలైన వాళ్ళు తమ కడుపులు నిండేలాగా షడ్రసోపేతంగా తిన్నారు. తరవాత తమ అనుచరుల కోసం మోయ గలిగినంత ఆహారాన్ని మూట గట్టుకుని తమ ఓడ దగ్గిరికి వచ్చేశారు.

కాని తీరా ఓడలోకి వచ్చి మూటలు విప్పితే ఆ మూటల్లో పిండాలు మాత్రమే ఉన్నాయి. తాము చూసినది దయ్యాల లంకే నని ఇప్పుడందరికీ రూఢి అయింది. వాళ్ళు లంగరు ఎత్తి, తెరచాపలెత్తి సముద్రం మీద బయలుదేరి కొంత కాలానికి క్షేమంగా తమ దేశం చేరుకున్నారు.

ఆ తరవాత ఆ దయ్యాల లంకను మరి చూసినవారు లేనే లేరు.

తాతయ్య ఈ కథ చెప్పి, "అందుచేతను, మనుషులుండే చోట మనుషులుండాలి. దయ్యాలుండే చోట దయ్యాలుండాలి. ఒకరి జోలికి మరొకరు రాకూడదు. మన మధ్యకి దయ్యాలు దారి తప్పి వచ్చినా మంచిగా వాటిని సాగనంపాలి గాని భయపడి కంగారు పడకూడదు," అన్నాడు.



# చంద్రుడిలో ఉండే ముసలమ్మ

ఒక గ్రామంలో ఒక బీదవాడుండే వాడు. వాడికి ప్రపంచంలో ఎవరూ లేరు. వాడు వడ్లు దంచి, కూలి డబ్బులతో బతికేవాడు. వాడు దంచిన వడ్లు చెరిగేటప్పుడు కుందేలొకటి వచ్చి తవుడు తినేది. అది అలా వాడికి మాలిమి అయింది.

బీదవాడు పగలే గాక రాత్రివేళ వెన్నెల ఉన్నప్పుడు కూడా వడ్లు దంచేవాడు. వాడికి ఒక్కకోరిక ఉండేది; తాను దంచిన వడ్లు చెరగటానికి ఆడదిక్కు ఉంటే ఎంత బాగుండును!

ఒక వెన్నెల రాత్రి వాడు వడ్లు దంచుతూండగా ఒక ముసలమ్మ వచ్చి దంచిన వడ్లు చెరగ సాగింది. వడ్ల దంపుడు పని త్వరగా సాగింది. చంద్రుడు లేనప్పుడు బీదవాడు వడ్లు దంచేవాడు కాడు, ముసలిది వచ్చేదీ కాదు.

చూసి చూసి బీదవాడు, "అవ్వా, నువ్వెవరు?" అని అడిగాడు.

"నేను చంద్రుడిలో ఉంటాను, నాయనా. ఒక్కడివే పాటు పడుతున్నావని సహాయం వస్తున్నాను. కావలిస్తే నువుకూడా అక్కడికే వచ్చెయ్యి," అన్నది. ఇందుకు వాడు ఒప్పుకుని తన కుందేలుతో సహా చంద్రుడిలోకి వెళ్ళి పోయాడు.

ఇప్పటికీ మనం పరీక్షగా చూస్తే చంద్రుడిలో వడ్లు దంచేవాడూ, చెరిగే ముసలమ్మా, తవుడు తినే కుందేలూ కనిపిస్తారు?






# శిశురోదన

ఎవరికైనా పెళ్ళి కావటం వ్యవధానంగా చుట్టుపక్కల అమ్మలక్క లందరూ వాళ్లకు పిల్ల లెప్పుడు పుడతారా అని ఆరాట పడి పోతారు. మహలక్ష్మికి పెళ్ళయి రెండేళ్ళు కావచ్చింది. కాని ఇంకా ఒక నలుసు ఆమె కడుపున పడలేదు. అమ్మలక్కలు ఒక నాడు జమీందారుగారి భార్యతో ఈ విషయమే ముచ్చటించారు.

ఒక పెద్ద ముత్తయిదువు ఇలా అన్నది :

"పోనీ అమ్మాయి చేత ఏదైనా వ్రతం చేయించండి. బిడ్డలుంటేనే ఇంటికి అందమూ చందమూనూ. ఇంట బిడ్డ నవ్వితే దేవతలు వస్తారనీ, బిడ్డ ఏడిస్తే దయ్యాలు పోతాయనీ అంటారు పెద్దలు."

బిడ్డ ఏడిస్తే దయ్యాలు పోతాయన్న ముక్క భీమన్న చెవిన పడింది. ఆడవాళ్ళు మాట్లాడుకుంటున్న అసలు విషయమేమిటో వాడు ఎరగడు. దయ్యా లింత సులువుగా పోతాయని వినేసరికి వాడికి ఆశ్చర్య మయింది. ఎందుకంటే జమీందారుగారి తోట ఇంట్లో దయ్యాలున్నాయని ప్రతీతి. వాటిని తరిమివెయ్యటానికి ఎవరూ ప్రయత్నించకపోగా, ఏటా ఆ దయ్యాలకు జాతర్లలాటివేవో చేసి, బలులు కూడా ఇచ్చేవారు. ఇదంతా భీమన్నకు చాలా చిరాకుగా ఉంటూండేది.

వాడు ఒకటి రెండు సార్లు ఈ దయ్యాల జాతర్లను గురించి ప్రస్తావించి, "దయ్యాలకి నిండు ప్రాణాలను బలి ఇవ్వట మేమిటి? వాటిని వదలగొట్టటానికి మరో మార్గం లేదా?" అని అడిగాడు.

"అమ్మయ్యో, దయ్యాలను గురించి అలా మాట్లాడరాదు. వాటి ఊసే ఎత్త గూడదు," అని మహలక్ష్మి వాణ్ణి హెచ్చరించింది. ఆ తరవాత వాడు దయ్యాల ప్రస్తావన భార్య దగ్గిర తీసుకు రాలేదన్న

మాటే గాని, వాటిని ఎలా వదిలించటమా అని లోపల ఆలోచిస్తూనే ఉన్నాడు. ఇంత కాలానికి ఆ కిటుకు వాడికి తెలిసిపోయింది. బిడ్డలు ఏడిస్తే చాలు దయ్యాలు పారి పోతాయి. ఈ మాటలు పెద్దలే చెప్పారు గనక ఇందులో అబద్ధం ఏమీ ఉండదు.

దయ్యాలను వెళ్ళగొట్టే ఉపాయంతో బాటే సాధనం కూడా భీమన్నకు అందు బాటులో ఉన్నది. జమీందారుగారి ఇంటి నౌకర్లలో సిద్దప్ప అనే వాడి భార్య ఇటీవలనే ప్రసవించింది. ఆ బిడ్డను మధ్య పడుకో బెట్టుకుని సిద్దప్పా, వాడి భార్యా వెనక వసారాలో పడుకుంటారు. ఆ బిడ్డ ఏడుపు సహాయంతో తోట యింటి దయ్యాలను పార దోలటానికి భీమన్న నిశ్చయించాడు.

అర్ధ రాత్రివేళ అందరూ గాఢ నిద్రలో మునిగి ఉన్న సమయంలో భీమన్న లేచి, చప్పుడు చెయ్యకుండా వెనక వసారాకు వెళ్ళి, సిద్దప్ప బిడ్డను ఎత్తుకుని చకచకా తోట యింటికి వెళ్ళాడు. బిడ్డను ఇంటి మధ్య పడుకోబెట్టి అది ఎప్పుడు ఏడుస్తుందా అని కొంతసేపు చూశాడు. కాని ఎంతకూ బిడ్డ ఏడవక సుఖంగా నిద్రపోతున్నది.

చివరకు విసిగి భీమన్న ఆ బిడ్డను కొంచెంగా గిల్లి, అది ఏడుస్తుంటే పారిపోయే



దయ్యాలను చూడటానికి గబగబా బయటికి వెళ్ళి చెట్టుచాటున దాక్కున్నాడు.

ఎంత గాఢ నిద్రలో ఉన్నా తల్లికి తన బిడ్డ ఏడుపు తెలుస్తుంది. దూరాన ఏడు స్తున్నప్పటికీ ఆ రోదన ధ్వని విని సిద్దప్ప భార్య చివాలున లేచి కూచున్నది. బిడ్డ తన పక్కన లేకపోవటం చూసి కంగారుగా భర్తను లేపింది.

క్షణంలో ఇంటిల్లి పాటీ కూడా లేచారు. దీపాలు తీసుకుని అందరూ తోట ఇంటి కేసి పరిగెత్తి రాసాగారు.

అదే సమయంలో భీమన్న దాక్కుని ఉన్న వేపుగా ఒక పందికొక్కు పారి

పోయింది. "దయ్యం! దయ్యం! చంపు! చంపు!" అంటూ భీమన్న కేకలు పెట్టి దాని వెంటపడ్డాడు. కాని పందికొక్కు ఏ పొదల మధ్యనో దూరి వాడికి చిక్కకుండా తప్పించుకు పోయింది.

బిడ్డ క్షేమంగా ఉన్నందుకు సిద్దప్ప, వాడి భార్యా సంతోషించారు. తరవాత అందరూ ఇంటికి తిరిగి వచ్చి ఎవరిమానాన వాళ్ళు నిద్రపోయారు.

మహలక్ష్మి మాత్రం అసలు జరిగిన దేమిటో భర్త నడిగి తెలుసుకున్నది.

"ఇలా చేస్తే దయ్యాలు పారిపోతాయా? ఈ పని చేస్తున్నానని నాతో మాట మాత్రం చెప్పకూడదా?" అన్నదామె.

"నువు దయ్యాల ఊసే ఎత్తవద్దన్నావు. అందుచేత నీతో చెప్పలేదు. అయితే, దయ్యాలు బిడ్డ ఏడిస్తే పారిపోతాయని పెద్దలు చెప్పిన మాట అబద్ధమా?" అని భీమన్న భార్యను అడిగాడు.

ఈ మాటకు ఏం జవాబు చెప్పాలో తెలియక మహలక్ష్మి, "నిజమే అనుకోండి. బిడ్డలు వాళ్ళంతట వాళ్ళు ఏడిస్తే దయ్యాలు పారి పోతాయిగాని మనం కావాలని గిల్లి ఏడిపిస్తే పోవు," అన్నది.

భీమన్న కొంచెం ఆలోచించి, "మరి నేను దయ్యం పారిపోవటం చీకట్లో చూశానే? దాని కేమంటావు?" అన్నాడు.

"అది ఏ ఎలుకో, పందికొక్కో అయి ఉంటుంది," అన్నది మహలక్ష్మి.

భీమన్న కూడా అంతే అయి ఉండవచ్చు ననుకున్నాడు.

కాని మర్నాడు ఆ చుట్టుపక్కలంతా గొప్పగా చెప్పుకున్నారు—సిద్దప్ప బిడ్డను రాత్రి దయ్యా లెత్తుకుపోయి తోట ఇంట్లో పెడితే జమీందారుగారి అల్లుడు భీమన్న వాటితో హోరాహోరి పోట్లాడి బిడ్డను రక్షించాడని!

[పై నెల మరొక సంఘటన]



# ఉరుము వెంట వర్షం!

[రామతీర్థ కథ]

సోక్రటీస్ అనే గ్రీకు తత్వవేత్తకు ఒక పరమ గయ్యాళి అయిన భార్య ఉండేది. ఒకనాడు సోక్రటీస్ ఏదో తాత్విక చింతనలో మునిగి ఉండగా భార్య వచ్చి పరుషమైన మాటలతో ఏదో అన్నది, ఏదో పని చెప్పింది.

కాని సోక్రటీస్ ఏదైనా సమస్యను గురించి గాఢంగా ఆలోచించేటప్పుడు ఆయన మనస్సు ఆ ఆలోచన మీదనే ఉండేది. అందుచేత ఆయన తన భార్యకు జవాబు చెప్పలేదు. ఆయన భార్య మరింతగా మండిపడి గొంతెత్తి గావు కేకలు పెట్టింది. అప్పటికీ సోక్రటీస్ తన ఆలోచన నుండి పైకి రాలేదు. ఆమె ఆగ్రహం పట్టలేక గిన్నెడు నీళ్ళు తెచ్చి భర్త నెత్తిన పోసింది.

సోక్రటీస్ తల ఎత్తి భార్యను చూసి, నవ్వి, "ఉరిమితే వాన కురుస్తుం దంటారు. ఆ మాట నిజమని ఈనాటికి తెలుసుకున్నాను!" అన్నాడు.





# అదృష్టదేవత

ఆఫ్రికాదేశంలో ఒక బెస్తవాడుండే వాడు. వాడు ఒక పెద్ద సరస్సులో చేపలు పట్టేవాడు. చేపలను పట్టటానికిగాను వాడు పెద్ద పెద్ద పళ్ళికలలాటి ఊతలు ఉపయోగించేవాడు. వాడు తన తెప్పలో ఈ ఊతలను పట్టుకు పోయి, సరస్సు ఆటే లోతులేని చోట వాటిని తాళ్ళు కట్టి దించేవాడు. తాళ్ళ చివర కర్ర ముక్కలు కట్టటం చేత అవి పైకి తేలి, ఊతలు ఎక్కడెక్కడ ఉన్నదీ వాడికి సులువుగా తెలిసేది. ఇంటికి వెళ్ళేటప్పుడు ఈ ఊత లన్నిటినీ పైకి లాగి, వాటిలో చిక్కిన చేపలతో పొట్ట పోసుకునేవాడు.

ఒకనాడు బెస్తవాడు తన ఊతలను ఒక్కొక్కటిగా పైకి లాగసాగాడు. రెండు ఊతల్లో ఒక్క చేపకూడా లేదు, మూడో దానిలో ఒక చిన్న ఎండ్రకాయ మాత్రం ఉన్నది. కాని నాలుగోది చాలా బరువుగా పైకి లేచింది. "అమ్మయ్య, నా అదృష్టం పండింది! నా దరిద్రం తీరిపోయింది!" అనుకుంటూ వాడు ఆ ఊతను తెప్ప మీదికి లాక్కున్నాడు. అందులో; ఎండి వరడు గట్టిన ఒక ముసలిది మాత్రం ఉన్నది!

బెస్తవాడి ఆశ్చర్యం క్షణంలో అసహ్యంగా మారింది. వాడా ముసలిదాన్ని మళ్ళీ సరస్సులోకి తొయ్యబోయాడు. కాని ఆమె వాడితో, "మళ్ళీ నన్ను నీటిలోకి తోసెయ్యకు, బాబూ. నీ వెంట నన్ను మీ ఇంటికి తీసుకు పో. నీ కేమీ నష్టం ఉండదులే," అన్నది.

"నిన్ను మా ఇంటికి తీసుకుపోనా? తాను దూర కంత లేదు, మెడకు డోలన్నట్టుగా, నేనే పొట్ట పోసుకోలేక చస్తుంటే నిన్ను కూడా ఎక్కడ పోషించేది?" అన్నాడు బెస్తవాడు.

కాని ముసలిది కాళ్ళా వేళ్ళా పడి వాణ్ణి వదిలి పెట్టక వాడి ఇంటికి వెళ్ళింది. వాడు

ఆఫ్రికా జానపద కథ

అయిష్టంగా తన కూడులో నుంచే కొంత ముసలిదాని క్కూడా పెట్టాడు. ఇద్దరూ తిండి తిన్నాక వాడు, "నా కేదో లాభం కలుగుతుందంటివే, ముసలితొక్కా? ఆ లాభం ఏమిటో స్పష్టంగా చెప్పు. విని సంతోషిస్తాను," అన్నాడు.

"రేపు సాయంకాలం లోపల నువ్వొక పశువుల మందకు యజమాని కాబోతున్నావు. అందుచేత విశాలమైన పశువుల దొడ్డి ఒకటి తయారు చేసుకో," అన్నది ముసలిది.

బెస్తవాడు ఏవేవో ప్రశ్నలు వేశాడు. కాని ఆమె, "నేను చెప్పినట్టు చెయ్యి," అన్నది.

బెస్తవాడు తనలో తాను గొణుక్కున్నాడు, అయినా వాడు మర్నాడల్లా శ్రమ పడి చుట్టూ ముళ్ళ కొమ్మలతో బలమైన కంచె కట్టి పశువుల దొడ్డి తయారు చేశాడు. అది పూర్తి అయేసరికి సూర్యాస్తమయం కావచ్చింది.

ఈ పని పూర్తి అయిన మరుక్షణమే సరస్సు దిక్కు నుంచి పశువుల అరుపులు విన వచ్చాయి. త్వరలోనే ఒక ఎద్దు వెంబడి అనేక ఆవులూ, దూడలూ పెద్ద మందగా వచ్చి పశువుల దొడ్డిలో ప్రవేశించి, రోజూ అలవాటైన వాటిలాగా తలా ఒక చోటా పడుకున్నాయి.



ఇక నుంచీ బెస్తవాడి జీవితం పూర్తిగా మారిపోయింది. వాడిప్పుడు పేదవాడు కాక పోగా మహా ధనికుడు. ఆ చుట్టుపట్ల చాలా మైళ్ళ మేర వాణ్ణిమించిన ధనికుడు లేడు. వాడు పొలాలు కొనుక్కున్నాడు, పెళ్ళి చేసుకుని ఒక ఇంటివాడయాడు, ఆ ప్రాంతాల ఉండే ఘరానా మనుషులతో బాటు జమ అయాడు. ఎవరన్నా సలహా అడగటానికి వస్తే గడ్డం నిమురుకుంటూ, "నా కిదే పని అనుకున్నావా? రేపు కనిపించు, చూస్తాం! వట్టి చేతులతో వచ్చేవు!" అని దర్పంగా మాట్లాడటం నేర్చాడు. ఈ విధంగా ఆరు మాసాలు గడిచాయి. ఒక

రోజు బెస్తవాడు పొరుగూళ్ళో విందు జరిగితే అక్కడికి వెళ్ళాడు. అక్కడ బాగా తిని, మితిమించి సారాయి తాగాడు. విందు ముగిసే సరికి పొద్దుపోయింది. బెస్తవాడు తూలుతూ, అవకాశం దొరికితే ఎవరి మీద నైనా విరుచుకు పడటానికి సిద్ధంగా ఇంటికి వచ్చాడు. ఇంటో అందరూ తలుపులు వేసుకుని గాఢ నిద్రలో మునిగి ఉన్నారు.

"తలుపు! తలుపు! కామందు వచ్చాడు, తలుపు తెరవండి!" అని వాడు కేకలు పెట్టాడు. కాని ఎవరూ పలకలేదు. వాడికి ఆగ్రహం తన్నుకొచ్చింది. "ఏమిటీ? నేనంటే అంత అలుసై పోయిందా? సరస్సులో నుంచి నేను పైకి తీసిన ఆ ముసలితొత్తు ఏం చేస్తున్నదీ? లేచి తలుపు తియ్యవే, ముసలి పీనుగా!" అని అరిచాడు. వాడి మాట వాడి నోట ఉండగానే తలుపు తెరిచి ముసలిది వాకిట నిలబడింది. ఆమె వాడి కేసి చురచురా చూస్తూ, "నువు నన్ను నిష్కారణంగా తిట్టావు. చేసిన మేలు మరిచే వాళ్ళ దగ్గిరా, మసలు కోవటం తెలియని వాళ్ళ దగ్గిరా నేనుండను. రేపే నా చోటికి నేను వెళ్ళిపోతున్నాను," అన్నది.

"ఓ యబ్బో! పోతే పో! పీడ విరగడ అవుతుంది," అన్నాడు బెస్తవాడు.

మర్నాడు ఉదయం ముసలిది నిద్ర లేచింది. పక్క బట్టలు చక్కగా మడిచి పెట్టింది. అంట్ల గిన్నెలు శుభ్రంగా తోమింది. ఇల్లు ఊడ్చింది. ఇంటి నుంచి ఒక్క పూచిక పుల్లకూడా తీసుకోకుండా వెళ్ళి పశువుల దొడ్డి వాకిలి తెరిచింది. తరవాత ఆమె సరస్సు కేసి నడిచింది. పశువులన్నీ జంటలు జంటలుగా ఆమె వెనక బయలుదేరి వెళ్ళి, ఆమెతో బాటు సరస్సులో ప్రవేశించి కనిపించకుండా పోయాయి. బెస్తవాడు మళ్ళీ చేపలు పట్టి జీవించే స్థితికి వచ్చేశాడు. వాడి అదృష్ట దేవత వెళ్ళిపోయింది.





# చెవిటిమాలోకం

ఒక గ్రామంలో ఒక మఠం ఉండేది. ఆ మఠంలో ఒక సిద్ధుడూ, ఆయన శిష్యుడూ ఉండేవారు. ఒకనాడు సిద్ధుడు తన శిష్యుడితో, "ఒరే, నువు గ్రామానికి వెళ్ళి కొంచెం పొగాకు పట్టుకు రారా!" అన్నాడు.

శిష్యుడికి పుట్టెడు చెవుడు. గురువుగారు తనని పచ్చడి పట్టుకు రమ్మన్నాడనుకుని వాడు బయలుదేరి గ్రామానికి వెళ్ళాడు. ఒక ఇంటి ముందు ఒక పిల్ల మగ్గం మీద కూచుని నేస్తున్నది.

"అమ్మాయీ, మఠానికి పచ్చడి కాస్త భిక్ష పెడతావా?" అని శిష్యుడడిగాడు.

ఆ పిల్లకూ చెవుడే. అంచేత శిష్యుడడిగిన మాట ఆమెకు మరొకలా వినపడింది.

"ఈ నేసే పంచె సొంతానికి కాదు, అమ్మకానికే," అన్నదామె.

"ఈ భాగ్యానికే కోపం దేనికీ? నీకు చెయ్యి విడిగాలేకపోతే నేనే లోపలికి వెళ్ళి ఇంత పచ్చడి తీసుకుంటానుగా," అంటూ చెవిటి శిష్యుడు ఇంట్లోకి జొరబడి, వంటిల్లు వెతికి, కనిపించిన పచ్చడి కాస్తా తీసుకుని మఠానికి తిరిగి వెళ్ళిపోయాడు.

మగ్గం మీద పని చేసుకునే చెవిటిపిల్ల శిష్యుడు చేసిన పని గమనించి వాళ్ళమ్మ దగ్గిరికి పరిగెత్తింది.

ఆ పిల్ల తల్లి ఊరి చెరువు గట్టున బట్టలు ఉతుకుతున్నది.

"అమ్మా చూడవే, ఆ మఠంలో ఉండే కుర్రవాడేం చేశాడోనూ! నేను మగ్గం మీద పని చేసుకుంటుంటే వచ్చి, నేసే బట్ట సొంతానికా, అమ్మకానికా అని అడిగాడు. నిజంగానే అడుగుతున్నాడు కాబోలని చెప్పా. అంతలోనే చటుక్కున ఇంట్లోకి జొరబడి, చెప్పకుండా పెట్టకుండా పచ్చడి కాస్తా పట్టుకుని చక్కాపోయాడు," అని చెవిటి పిల్ల తన తల్లితో ఫిర్యాదు చేసింది.

ఎల్. శంకర్రావు

తల్లి ముక్కు మీద వేలేసుకుని నిర్ఘాంత పోతూ, "ఓసీ, నీ కిప్పణ్ణుంచీ పెళ్ళి ఆలోచ నేమిటే? నీ కంటె కూడా ఎదిగిన వాళ్ళ కింకా సంబంధాలు కూడా చూట్టం లేదు గదా! అయినా ఆ గొడవేదో మేం చూస్తాంలే. నువ్వెళ్ళి పని చూసుకో. నాతో అన్నావు గనక సరిపోయింది. మరొకరు వింటే నవ్విపోదురు—ఇంత చిన్నపిల్ల కప్పుడే పెళ్ళిరంధి ఏమిటా అని! పద పద!" అన్నది. ఆవిడకూ్కడా పుట్టెడు చెవుడు. కూతురు వెళ్లి యథాప్రకారం మగ్గం మీద పని సాగించింది. తల్లి తన చాకిపని కానిచ్చుకుంటూ ఆలోచించింది. నిజంగా కూతురికి పెళ్ళి ఆలోచనే కలిగితే చేసెయ్యా టమే మంచిదేమో!

"ఎందుకైనా మంచిది. వాళ్ళ నాన్నతో ఈ విషయం మాట్లాడి చూస్తాను. ఆయన ఏమంటాడో!" అనుకుని ఆమె పిండిన బట్టలు భుజాన వేసుకుని ఇంటికి వచ్చింది.

ఆవిడ భర్త రోజూ ఒక చోట కూచుని బుట్టలూ, పళ్ళికలూ, గంపలూ, చాటలూ అవీ అల్లుతూంటాడు. ఆవిడ తడిబట్టలు పరిచి ఆరవేసి, భర్త పని చేసుకునే చోటికి వెళ్ళి, "చూశావా? అమ్మాయి పెళ్ళి కోసం తొందరపడుతోంది. దాని కింకా పెళ్ళీడు రానేలేదు. నేను చెరువు దగ్గిర బట్ట లుతు కు్కంటూంటే కొంపమునిగినట్టు పరిగెత్తు కొచ్చి, తనకు పెళ్ళి చేసితీరాలని కూచు న్నది. చూస్తాంలే, నువెళ్ళి పని చూసుకో అని పంపేశా. మీ సలహా ఏమిటీ? కొంత కాలం ఆగుదామా, లేక దాని కిప్పుడే పెళ్ళి చేస్తామా?" అన్నది.

ఆమె భర్త పని మానేసి ఆమె చెప్పిన దంతా శ్రద్ధగా విని, "ఈ భాగ్యానికి నువు ఝామున్నరసేపు వాదించటం అనవసరం. గుండ్రగా ఉండేని జల్లెళ్ళు! చాటలు సల చదరంగానే ఉంటాయి!" అన్నాడు.

అతడికీ చెవుడే!





# కిష్కింధా కాండ

సుగ్రీవుడి మాటలు విని రాముడు "మీ ఇద్దరి మధ్యాగల వైర కారణమేమిటో తెలుసుకోవాలని ఉన్నది. ఆ కారణమూ, మీ బలాబలాలూ తెలుసుకున్న మీదట నీకు సుఖం కలిగే మార్గం ఆలోచించ గలుగుతాను," అన్నాడు.

దానికి సుగ్రీవు డిలా చెప్పాడు.

"మా అన్న అయిన వాలిని నా తండ్రీ, నేనూ ఎంతో గౌరవంతో చూసే వాళ్ళం. మా తండ్రి పోయాక, పెద్దవాడు గనక వాలి రాజ్యానికి వచ్చాడు. నేను వాలికి సేవకుడు లాగా ఎంతో వినయ విధేయతలు చూపే వాణ్ణి. దుందుభి అనేవాడి పెద్ద కొడుకు మాయావి అనే రాక్షసుడు చాలా గొప్ప పరాక్రమశాలి. ఒక స్త్రీ విషయంలో మాయావికీ, వాలికీ తగాదా వచ్చింది. ఒకనాటి అర్థరాత్రివేళ ఆ మాయావి కిష్కింధా ద్వారం వద్దకు వచ్చి, పెద్ద పెట్టున గర్జిస్తూ వాలిని యుద్ధానికి పిలిచాడు. వాలి నిద్ర మేలుకొని మాయావి మదం అణచటానికి బయలుదేరాడు. నేనూ, ఆడ వాళ్ళూ ఎంత ఆపినా వాలి ఆగలేదు. అతను ఒంటరిగా పోతున్నాడే అని నేను కూడా వెంట వెళ్ళాను.

"మాయావి మా అన్నను చూస్తూనే భయపడి పారిపోసాగాడు. మేమతని వెంట పడ్డాం. ఇంతలో చంద్రోదయం కూడా అయింది. మాకూ తనకూ ఉండే దూరం



క్రమంగా తగ్గుతూండటం చూసి మాయావి ఒక బిలంలో దూరాడు.

"వాలి ఆ బిలంలోకి వెళ్ళి మాయావిని చంపివస్తాననీ, తాను వచ్చేదాకా నన్ను బిలం వెలపల ఉండమనీ చెప్పాడు. నేను కూడా వస్తానంటే వినక, తన పాదాలమీద ప్రమాణం చేయించుకుని వాలి ఆ బిలం ప్రవేశించాడు.

"మా అన్న కోసం ఆ బిల ద్వారం వద్ద పూర్తిగా ఒక సంవత్సరం కాచుకుని ఉన్నాను. వాలి జాడలేదు. వాలి చనిపోయి ఉంటాడేమోనని నాకు భయమూ, అనుమానమూ కలిగాయి. నా భయానికి



తగ్గట్టుగా బిలం నుంచి నురుగుతో కూడిన ఎర్రని రక్తం రాసాగింది. లోపల నుంచి గర్జనలూ, ఆక్రందనలూ వినిపించాయి. ఆక్రందన ధ్వని వాలిదిలాగా నాకు తోచింది. ఈ లక్షణాలన్నీ గమనించి వాలి చని పోయాడనుకుని నాకు భయమూ, దుఃఖమూ కలిగాయి. నేను ఆ బిల ద్వారాన్ని పెద్ద కొండరాయితో మూసి, వాలికి జలతర్పణాలు విడిచి కిష్కింధకు తిరిగి వచ్చాను.

"వాలి మరణ వార్త నేనై చెప్పకపోయి నప్పటికీ మంత్రులు నా నుంచి రాబట్టి, తమలో తాము ఆలోచించుకుని నాకు పట్టాభిషేకం చేశారు. నేను రాజ్యపాలన చేస్తూండగా వాలి మాయావిని చంపేసి తిరిగి వచ్చాడు.

"నేను రాజు నయానని తెలిసి వాలి మండి పడ్డాడు. మంత్రులను బంధించాడు. నన్ను నానా మాటలూ అన్నాడు. నేను గౌరవంగా వాలికి నమస్కారం చేశాను. అతను నన్ను ఆశీర్వదించ లేదు. నా కిరీటం తీసి అతని పాదాల దగ్గిర పెట్టాను. కాని అతని కోపం చల్లారలేదు. అతన్ని రాజ్యం చెయ్యమని వేడుకున్నాను. బిలం దగ్గిర నేను చూసినదీ, విన్నదీ చెప్పాను. బిలానికి రాయి ఎందుకు అడ్డంగా పెట్టానో చెప్పాను.



నేను రాజ్యాభిషేకం కోరలేదనీ, రాజ్య క్షేమం కోరి మంత్రులే నాకు పట్టం గట్టారనీ అన్నాను. నీవు లేనప్పుడు రాజుగా పని చేశానుగాని, ఇప్పుడు నీకు యువరాజునేనని కూడా చెప్పాను.

"వాలి ఇదేదీ లక్ష్య పెట్టాడుకాడు. తన కిష్టులైన మంత్రుల ముందు నన్ను నానా దుర్భాషలూ ఆడాడు. అతను బిలంలో ప్రవేశించాక ఒక ఏడాదిపాటు మాయావి కనిపించనే లేదట. తరవాత వాణ్ణీ, వాడి బంధువుల నందరినీ చంపాడట. రక్తం ప్రవహించ నారంభించగానే దుర్గంధం భరించలేక బిల ద్వారం వద్దకు వచ్చి నన్ను పిలిచాడట. నేను తన కోసం వేచి ఉండక పోగా, తనను బిలంలో బంధించటానికి రాయి అడ్డు పెట్టానని వాలి తన మంత్రులతో అన్నాడు. ఇలా నాపై నింద మోపిన అనంతరం అతను నన్ను కట్టు బట్టతో కిష్కింధ నుండి వెళ్ళ గొట్టేశాడు. నా భార్యను కాజేశాడు.

"ఈ విధంగా అన్న చేత వెళ్ళగొట్టబడి నేను ప్రపంచమంతా తిరిగాను. చిట్టచివరకు నాకీ ఋశ్యమూకం మీద నిలవ నీడ దొరికింది. ఎందుకంటే ఒకానొక కారణం చేత వాలి ఈ పర్వతం పైన అడుగు పెట్ట



లేడు. నా వల్ల ఏ తప్పూ లేకపోయినప్పటికీ నేనిలా కష్టాల పాలయాను.

"ఇక వాలియొక్క శక్తి సామర్థ్యాలు చెబుతాను. అతను సూర్యోదయానికి పూర్వమే నాలుగు దిక్కుల సముద్రాలూ సునాయాసంగా చుట్టి వస్తాడు. పర్వత శిఖరాలపై కెక్కి కొండరాళ్ళను బంతుల్లాగా ఎగరేసి పట్టుకుంటాడు. పెద్ద పెద్ద అడవి మానులను అవలీలగా విరిచెయ్యగలడు.

"ఇంకొక కథ చెబుతాను. దున్నపోతు రూపంలో దుందుభి అనే రాక్షసుడు మహా బలశాలి ఉండేవాడు. వాడిది వెయ్యి ఏనుగుల బలం. వాడు బల గర్వితుడై



సముద్రుడి వద్దకు వెళ్ళి తనతో యుద్ధానికి రమ్మని పిలిచాడు. సముద్రుడు మానవ రూపంలో పైకి వచ్చి దుందుభితో, 'నీ బోటి యుద్ధ విశారదుడితో యుద్ధం చేసే శక్తి నాకైతే లేదుగాని అలాటి శక్తి గల వాడెవడైనా ఉంటే అది హిమవంతుడు. నీవు అతనితో యుద్ధం చేస్తే బాగుంటుంది,' అని చెప్పాడు.

"దుందుభి శరవేగంతో హిమాలయానికి వెళ్ళి, తన కొమ్ములతో గుండురాళ్ళను విరజిమ్ముతూ, రంకెలు పెట్టి హిమవంతుణ్ణి యుద్ధానికి పిలిచాడు. హిమవంతుడు దుందుభితో, 'నాయనా, నేను నీతో యుద్ధం చెయ్యలేను, నన్నెందుకు బాధిస్తావు? అదీ



గాక ఇక్కడ ఎందరో మునులు తపస్సు చేసుకుంటున్న కారణం చేత యుద్ధానికి వీలుపడదు. కిష్కింధలో వాలి అనే వానర శ్రేష్ఠుడున్నాడు. యుద్ధంలో అతను నీ తీట తీర్చగలడు,' అని చెప్పాడు.

"దుందుభి కిష్కింధకు వచ్చి ద్వారం వద్ద నేలను గిట్టలతో గీరుతూ ఆర్భాటం చేశాడు. వాడు చేసే ఆగడం సహించలేక వాలి అంతఃపుర కాంతలతో సహా బయలుదేరి వచ్చాడు. అతను దుందుభితో, 'ఓరీ, నేను నిన్నెరుగుదును. ఎందుకు రంకెలు పెడుతున్నావు? ప్రాణాల మీద ఆశ లేదా?' అన్నాడు. దుందుభి మండిపడి, 'స్త్రీల ఎదట బీరాలు పలకటం కాదు, నాతో యుద్ధం చెయ్యి. ఇప్పుడు కాకపోతే, ఈ రాత్రి అంతా సుఖంగా గడిపి, నీ వానరుల కందరికీ అప్పగింతలు చెప్పి, నీ స్థానంలో మరొక రాజును ఏర్పాటు చేసుకుని, ఆఖరుసారి కిష్కింధ అంతా చూసుకుని రేపు ఉదయం యుద్ధానికి రా! అంతదాకా నీకు గడువిస్తాను,' అన్నాడు.

"వాలి దుందుభిని చూసి హేళనగా నవ్వి, తార మొదలైన అంతఃపుర స్త్రీలను పంపేసి, తనకు ఇంద్రు డిచ్చిన కాంచన మాలను మెడలో వేసుకుని యుద్ధానికి



వచ్చాడు. ఇద్దరికీ భయంకరమైన యుద్ధం జరిగింది. వస్తూనే వాలి దుందుభి కొమ్ములు పట్టుకుని గిరగిరా తిప్పి విసిరి నేలకేసి కొట్టాడు. ఆ దెబ్బకు దుందుభి చెవుల నుంచి రక్తం కారింది. క్రమంగా వాలి బలం హెచ్చింది, దుందుభి బలం క్షీణించింది. చివరకు వాలి ఆ రాక్షసుణ్ణి ఎత్తి నేలకు వేసి కొట్టి చంపాడు. అలా చచ్చిన దుందుభి కళేబరాన్ని వాలి ఎత్తి ఆమడ దూరాన వెళ్ళి పడేలాగా విసిరి వేశాడు. ఆ కళేబరం నోట కారే రక్తపు చుక్కలు మతంగ మహాముని ఆశ్రమంలో పడ్డాయి. ఆ నెత్తురు చుక్కలు చూసి మతంగుడు మండిపడి ఆశ్రమం దాటి వచ్చి దుందుభి కళేబరాన్ని చూసి, 'ఈ రాక్షస కళేబరాన్ని ఇక్కడికి విసిరిన వాడుగాని, వాడి అనుచరులుగాని ఈ వనంలోకి వస్తే చస్తారు!' అని శపించాడు.

"మతంగ మహాముని శాపం విని ఆ ప్రాంతాల ఉండే వాలి అనుచరులు భయపడి వెళ్ళిపోయి వాలితో ఈ సంగతి చెప్పారు. శాప విమోచనం చెయ్యమని వాలి వేడుకున్నప్పటికీ మతంగుడు అనుగ్రహించ లేదు. అది మొదలు వాలి ఈ ఋశ్యమూకం చాయలకు రాడు. ఆ సంగతి తెలిసి నేను నా మంత్రులతో ఇక్కడ తల





దాచుకున్నాను. అదుగో, గుట్టలాగా కని పించే దుందుభి కళేబరం!

"వాలి బలానికి మరొక ఉదాహరణ కూడా చెబుతాను. ఆ కనిపించే ఏడు సాల వృక్షాలున్నాయే, వాటిలో దేని కాండంలో నుంచి అయినా దూసుకుపోయేలాగా వాలి బాణం వేయగలడు. ఇంత శక్తి మంతుణ్ణి నీవు ఏ విధంగా వధిస్తావో!"

సుగ్రీవుడు చెప్పినదంతా విని లక్ష్మణుడు నవ్వుతూ, "రాముడు ఏం చేస్తే నీకు నమ్మకం కలుగుతుంది?" అని అడిగాడు.

సుగ్రీవుడు లక్ష్మణుడితో, "నాకు వాలి బల పరాక్రమాలు తెలుసును. అతను ఎన్నడూ ఓటమి ఎరగినవాడు కాడు. అందుచేతనే అతనికి వెరిచి ఇక్కడ ఉన్నాను. నాకు రాముడి పరాక్రమం తెలియదుగద!" అన్నాడు.

రాముడు దుందుభి కళేబరాన్ని సమీ పించి కాలి బొటన వేలితో ఎత్తి పైకి కిందికీ ఆడించి విసిరే సరికి అది పది ఆమడల దూరాన వెళ్ళి పడింది.

అది చూసి సుగ్రీవుడు ఆశ్చర్య పడ టానికి మారుగా, "రామా, దీన్ని ఆమడ దూరం విసిరి వేసినప్పుడు వాలి యుద్ధం చేసి బాగా అలిసి ఉన్నాడు. అదీగాక అప్పుడది కొత్త కళేబరం, ఇప్పుడది ఎండి పోయి తేలిక అయింది. అందుచేత నీకూ వాలికీ గల తారతమ్యం నాకు స్పష్టంగా తెలియలేదు. ఈ సాల వృక్షాలలో దేన్ని గాని దూసుకు పోయేలాగా నీవు బాణం వేసి నట్టయితే మీ ఇద్దరి బలా బలాలు తెలుసుకో గలుగుతాను," అన్నాడు.

రాముడు సరేనని ఒక తీవ్రమైన బాణం ఎక్కు పెట్టేసరికి అది ఏడు సాల వృక్షాల కాండాలలో నుంచీ దూసుకు పోయి, కొండ లోకి చొచ్చుకు పోయి, భూమిని పగల గొట్టుకుని మళ్ళీ పైకి వచ్చి రాముడి అంబుల పొదిలో ప్రవేశించింది.

ఇది చూసి సుగ్రీవుడు నిర్ఘాంత పోయి, "రామా, వాలి మాట దేనికి, దేవేంద్రుడు దేవతలందరితో కలిసి వచ్చినా నీ ఎదట నిలవలేడు. నీ మైత్రి కలగటం నా అదృష్టం! ఇంక నా శత్రువైన వాలిని ఇప్పుడే వధించు," అంటూ రాముడి ముందు సాష్టాంగ పడి నమస్కరించాడు. రాముడు సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, "ఇప్పుడే కిష్కింధకు పోదాం. నీవు మా కన్న ముందు వెళ్ళి వాలిని యుద్ధానికి పిలు," అన్నాడు.

రామ లక్ష్మణులు సుగ్రీవుడు మొదలైన వారందరూ కిష్కింధకు వెళ్ళారు. మిగిలిన వారంతా దట్టమైన చెట్ల చాటున దాక్కున్నారు, సుగ్రీవుడు మటుకు దట్టీ బిగించి, వాలికి వినపడేలాగా భయంకరమైన గర్జనలు చేశాడు.

తమ్ముడి గర్జనలు విని మండి పడుతూ వాలి వచ్చాడు. అన్నదమ్ము లిద్దరూ ఘోరంగా తన్నుకున్నారు. రాముడు విల్లూ, బాణమూ పట్టుకుని కూడా, వారిద్దరిలో ఎవరు వాలి అయినదీ, ఎవరు సుగ్రీవుడైనదీ తెలుసుకోలేక చూస్తూ ఉండిపోయాడు.

ఈలోపల సుగ్రీవుడు వాలి చేత చావు దెబ్బలు తిని, ఒళ్ళంతా నెత్తురు కారుతూ అయాసంతో అటూ ఇటూ చూసి, రాముడు కనబడకపోయేసరికి పారిపోసాగాడు. వాలి అతని వెంట పడ్డాడు. సుగ్రీవుడు వాలికి చిక్కకుండా పారిపోయి ఋశ్యమూకం చేరుకున్నాడు. "బతికి పోయావు పో!" అని వాలి వెనక్కు తిరిగి వచ్చేశాడు.

తరవాత రామ లక్ష్మణులూ, హనుమంతుడూ కూడా ఋశ్యమూకానికి తిరిగి వెళ్ళారు. సుగ్రీవుడు రాముణ్ణి చూసి అవమానంతో తల వంచుకుని, "ఇదేంపని? నన్ను తన్నించటానికా వాలిని యుద్ధానికి పిలవమన్నావు? వాలిని చంపటం చేత కాదని చెప్పి ఉంటే నేను ఇక్కడ నుంచి కదలనే కదలను గద!" అన్నాడు.



# 18. మాటర్ హార్న్

స్విజర్లాండ్ ఇటలీల మధ్య ఆల్ప్సు పర్వతాలలో గల ఈ శిఖరం యూరప్ కంతటికీ ఎత్తయినది. భూమి మట్టం నుంచి దీని ఎత్తు 14,780 అడుగులు. 1865 జూలై 14న ఎడ్వర్డ్ హ్వింపర్ అనే ఆయన తన అనుచరులతో ఈ శిఖరాన్ని మొదటగా ఎక్కాడు.






1. ఎస్. వి. సుబ్బారెడ్డి, కోవెలకుంట్ల

కష్టసాధ్యమైన ప్రశ్నలకు మీరు యిట్టే సునాయాసంగా సమాధానా లిచ్చి మమ్మల్ని సంతోష పరుస్తున్నారు కదా! మీకు బృహస్పతి ఏమైన దగ్గరి చుట్టమా?

కాదు గాని, మా కార్యాలయంలో సరస్వతిని కట్టేసుకున్నాం!

2. కొ. విజయశ్రీ ప్రమోదిని, బేగంపేట

అన్నయ్యా, చిన్న సందేహం. ఫోటో వ్యాఖ్యల పోటీకి ఒకే కార్డులో రెండింటికి మించిన వ్యాఖ్యలు పంపవచ్చునా?

తప్పక పంపవచ్చు. ఈ మాట అదివరకే చెప్పాం.

3. డి. సుశీల, పల్లపాడు

ఏయే గ్రహాలను శాస్త్రజ్ఞులు పూర్తిగా పరిశీలించారు? అచ్చట జీవరాసు లున్నాయా? వాటి లక్షణాలేమిటి?

ఏ గ్రహాన్నీ శాస్త్రజ్ఞులు పూర్తిగా పరిశీలించ లేదనే చెప్పాలి. సమీప గ్రహాలను టెలిస్కోపులతో చూడవచ్చు; వాటి వాతావరణంలో ఏయే వాయువు లున్నదీ తెలుసుకో వచ్చు; వాటి శీతోష్ణస్థితి కూడా అంచనా కట్టవచ్చు. ఆ పైన శాస్త్రవేత్తలు చేయ గలిగినదంతా ఊహాగానమే. కుజ (అంగారక) గ్రహంలో తక్కువరకం ప్రాణు లుండే అవకాశం ఉందనీ, చంద్రుడిలో ఆ అవకాశం కూడా లేదనీ శాస్త్రజ్ఞు లంటున్నారు. శుక్ర గ్రహం ఎల్లప్పుడూ మేఘా వృతమై ఉండటంచేత దాని "నేల" ఎలా ఉండేదీ తెలియదు. అక్కడి వాతావరణంలోని వాయువులను బట్టి అక్కడ ప్రాణులు లేకపోవచ్చునని శాస్త్రవేత్తల అనుమానం. బుధ గ్రహంలో ఒకవైపు దుర్భరమైన వేడి, మరొకవైపు దుర్భరమైన చలి. (ఆ గ్రహం సూర్యుడి కేసి ఎప్పుడూ ఒక ముఖమే చూపుతుంది) అందుచేత అక్కడా ప్రాణులు లేక పోవచ్చు. తీరా ఈ గ్రహాలకు మనుషులు వెళ్ళే రోజు వచ్చాక ఈ ఊహాగానాలన్నీ తారుమారు కావచ్చు.

4. • ఆర్. సుబ్రహ్మణ్యం, పెదపాలెం

మీ "చందమామ"లో పెద్దగా క్రొత్త రచయితల పేర్లు కన్పడవు. కారణం, పాతవారికే కాని కొత్త వారికొక మాత్రాన స్థానం దొరకదేమో?

రచన చేసేవారి పేర్లు "చందమామ"కు ముఖ్యం కాదు, కథలే ముఖ్యం. కథలు స్వకపోల కల్పితాలు కూడా కానవసరం లేదు. మీ సందేహం ఇతర పత్రికలకు వర్తించ వచ్చు "చందమామ"కు వర్తించదు.

5. పి. కోటేశ్వరరావు, రూర్కెలా

మనదేశం 1949 జనవరి 26 న రిపబ్లిక్ అయినదని ప్రచురించారు. కాని మనదేశం రిపబ్లిక్ అయినది 1950 జనవరి 26 న.

అవును, మాదే పొరపాటు.

6. చల్లా శంకరరావు, రాజమండ్రి

"గంధర్వ చక్రవర్తి కూతురు" ఇంకా ఎన్ని భాగాలు ఉంటుంది? దయచేసి ఆ కథ కొంచెము పొడిగించమని మా ప్రార్థన.

"గంధర్వ చక్రవర్తి కూతురు" కథ జులై సంచిక దాకా పొడిగిస్తాము. ఆ పైన సాధ్యం కాదు.

7. కాసం యాదగిరి, జనగామ

వాల్మీకి రచించిన "రామాయణం" కల్పితమైనదా? లేక జరిగిన సంఘటనలను తెలిపే కథనా?

రామాయణం ఇతిహాసం కాదు, కావ్యం. అందుచేత అది కల్పిత కథే అనుకోవాలి. అయితే వాల్మీకి కల్పనకు ఆధారంగా జానపదగాధ ఉండినట్టు కనిపిస్తుంది. అలాటి గాధ కొన్ని మార్పులతో బౌద్ధ వాఙ్మయంలో ఉన్నది.

8. పి. సాంబమూర్తి, వాడపాలెం

ఉత్తరకు మృత శిశువు జనించిన తరువాత కృష్ణుడు ఆ శిశువును తన కాలితో ఆపాద మస్తకం రాచి బ్రతికించాడు అని వ్రాశారు [మార్చి]. కాని చేతితో తాకితే బాగుండునని నా భావము. తమరేమంటారు?

భారతం రచించిన వ్యాసుడి నిశ్చయాన్ని మార్చటానికి మన మెవరం!

Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

చెదరని లక్ష్యం

పంపినవారు:
పి. రాధాకృష్ణ, నందిగామ

Photo by S. G. Pradhan



బహుమతి
పొందిన వ్యాఖ్య

చరిత్రకు సాక్ష్యం

పంపినవారు :
పి. రాధాకృష్ణ, నందిగామ

# గ్రహణాలను గురించి

★ సంపూర్ణ సూర్యగ్రహణం భూమధ్యరేఖ నుంచి చూస్తే ఎక్కువ సేపు కనిపిస్తుంది. ఇది 7న్నర నిమిషాలు మించదు. భూమధ్య రేఖనుంచి దూరంగా వెళ్ళిన కొద్దీ ఈ కాలప్రమాణం తక్కువ అవుతుంది. సూర్యగ్రహణం పట్టు లగాయతు విడుపుదాకా 4 న్నర గంటలు పట్టవచ్చు.

★ సంపూర్ణ చంద్రగ్రహణం 1 గంట 50 నిమిషాలు మించదు. దీని పట్టు విడుపుల మధ్య కాలం 4 గంటల దాకా ఉండవచ్చు.

★ ఏడాదిలో కనీసం 2 సూర్యగ్రహణా లుంటాయి. అయిదు సంవత్సరాల కొక సంవత్సరం చంద్రగ్రహణమే కలగక పోవచ్చు.

★ సూర్యచంద్రగ్రహణా లన్నీ కలుపుకుంటే ఏడాదికి 7 గ్రహణాల దాకా కలగ వచ్చు. ఇది గరిష్ఠసంఖ్య. గ్రహణాల కనీస సంఖ్య 2—ఇవి సూర్యగ్రహణాలు.

★ ఉత్తరార్థ భూగోళంలో నివసించే వారికి సూర్యబింబం మీదుగా చంద్రబింబం కుడినుంచి ఎడమ పక్కగా వెళ్ళినట్టు కనిపిస్తుంది. దక్షిణార్థ గోళంలో వారికి ఎడమ నుంచి కుడికి వెళ్ళినట్టు కనిపిస్తుంది.

★ చంద్రగ్రహణ మప్పుడు చంద్రుడు భూమియొక్క నీడలోకి, ఎడమవైపు నుంచి ప్రవేశించినట్టు ఉత్తరార్థ గోళంలోనూ, కుడివైపు నుంచి ప్రవేశించినట్టు దక్షిణార్థ గోళంలోనూ కనిపిస్తుంది.

★ ప్రతి సూర్యగ్రహణమూ, చంద్రగ్రహణమూ కూడా 18 ఏళ్ళ 10 రోజుల 8 గంట లకు తిరిగి వస్తుంది. ఈ సంగతి 4 వేల ఏళ్ళక్రితం బాబిలోనియనులకు తెలుసు. దీనిని బట్టి వారు రాబోయే గ్రహణాలను అంచనా వేశారు.

★ ప్రతి రెండు చంద్రగ్రహణాలకూ మూడు సూర్యగ్రహణా లుంటాయి. అయితే మనం సూర్యగ్రహణాలకన్న చంద్రగ్రహణాలనే హెచ్చుగా చూడగలుగుతాం. కారణమేమంటే సూర్యుడికి అడ్డంగా వచ్చే చంద్రుడి నీడయొక్క కొన మాత్రమే భూమిపైన, చాలా కొద్ది మేరపడుతుంది. ఆ ప్రాంతాల గల వాళ్ళకే సూర్యగ్రహణం కనిపిస్తుంది. చంద్రగ్రహణ మప్పుడు చంద్రుడు భూమియొక్క నీడలోకి వచ్చినప్పుడు చంద్రుడు కనిపించే ప్రాంతంలో చాలా మేర చంద్రగ్రహణం కనిపిస్తుంది. ఈ కారణంచేతనే సంపూర్ణ సూర్యగ్రహణాలను పరిశీలించటానికి శాస్త్ర వేత్తలు పరికరాలతో సహా వేలకొద్దీ మైళ్ళు వెళతారు.

# ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1963 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చెదరని లక్ష్యం

రెండవ ఫోటో : చరిత్రకు సాక్ష్యం

పంపినవారు : పల్లపోతు రాధాకృష్ణ,

నందిగామ.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది

# భారతం

యాగాశ్వం ప్రాగ్జ్యోతిషం నుంచి సింధుదేశాల కేసి నడిచింది. దాని వెంట వస్తున్న అర్జునుణ్ణి సింధు వీరులు ప్రతిఘటించారు. తమ రాజైన సైంధవుణ్ణి చంపాడని అర్జునుడి పై వారికి చాలా ఆగ్రహంగా ఉన్నది. అందుచేత వారు అర్జునుణ్ణి చుట్టు ముట్టి బాణవర్షం కురిపించారు. అర్జునుడు మొదట తీవ్రంగా దెబ్బ తినికూడా వారితో వీరోచితంగా యుద్ధం సాగించాడు. కొంత సేపటికి సింధు వీరుల శక్తి సన్నగిల్లింది.

ఆ సమయంలో దుశ్శల ఒక రథంలో తన మనమణ్ణి కూచో బెట్టుకుని అర్జునుడున్న చోటికి వచ్చి, భోరున ఏడ్చింది. సైంధవుడి భార్యా, ధృతరాష్ట్రుడి కూతురూ అయిన దుశ్శలను అర్జునుడు ఓదార్చి ఆమె వచ్చిన కారణం అడిగాడు.

"అన్నా, వీడు నా కొడుకైన సురథుడి కొడుకు. నీకు పరీక్షిత్తు ఎంతో వీడు అంతే అనుకుని దయ చూపు. వీడి తండ్రి నీ చేత తన తండ్రి చచ్చిన సంగతి విని ఉన్నాడు, గుర్రం వెంట నీవు వస్తున్నావని తెలియగానే ప్రాణాలు విడిచాడు. నా భర్త మీకు చేసిన ద్రోహం మరిచిపో, ఈ సింధు వీరులను కూడా క్షమించు," అన్నది దుశ్శల. అర్జునుడు ఆమెను కౌగలించుకుని ఇంటికి పంపేశాడు.

అక్కడి నుంచి బయలుదేరిన గుర్రం మణిపుర రాజ్యానికి వెళ్ళింది. మణిపుర రాజైన బభ్రువాహనుడు తన తండ్రి వస్తున్నాడని తెలిసి అర్జునుడికి ఎదురు వచ్చాడు. అర్జునుడు ఇందుకు సంతోషించటానికి బదులుగా, "సాయుధుడనై యుద్ధానికి వచ్చిన నాకు నీవు ఎదుర్కోల ఇవ్వటం ఏమీ వీరోచితంగా లేదు," అని అవమానించాడు. అప్పుడు నాగలోకం నుంచి ఉలూచి వచ్చి బభ్రువాహనుడితో, "నాయనా, నేను నీ తల్లిని. నీ తండ్రి కోరినట్టు యుద్ధం చేసి నీ పరాక్రమంతో ఆయనను మెప్పించు," అన్నది. ఆ మాట విని, అంత వరకూ సిగ్గుతో తల వంచుకుని ఉండిన బభ్రువాహనుడు అర్జునుడితో యుద్ధం చెయ్యటానికి సన్నద్ధుడయాడు.

నిజానికి బభ్రువాహనుడు ఉలూచి కొడుకు కాడు. అతని తల్లి చిత్రాంగద. ఉలూచి ఒకప్పుడు, అర్జునుడు తీర్థయాత్రలు చేసేటప్పుడు, తన మాయచేత అతన్ని తీసుకుపోయి తన లోకంలో కొంతకాలం తన భర్తగా ఉంచుకుని అతనివల్ల ఇరావంతుడనే కొడుకును కూడా కన్నది. అర్జునుడు వెళ్ళిపోయినాక కూడా ఆమెకు అతనిపై ప్రేమ పోలేదు. అర్జునుడు శిఖండి చాటున ఉండి భీష్ముణ్ణి చంపినందుకు నరకానికి పోతాడని గంగాతీరాన వసువులు అనుకుంటుండగా విని, అర్జునుడు తన కొడుకుతో యుద్ధం చేసినట్టయితే ఈ నరకం తప్పుతుందని తెలుసుకుని ఆమె ఈ సమయంలో తండ్రి పై కొడుకును యుద్ధానికి ప్రేరేపించింది.

**Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

